శ్రీరస్తు.

శృంగారశాకుంతల మను

# శకుంతలాపరిణయము.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి విరచితము.





…చినది.

కార్యదర్శి



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే

ప్రకటితము.

1923

# పీఠిక.

మహాకవి కాళిదాసు వ్యాసభారతమునుండి దుష్యంతుకథను గైకొని మార్పులు కొన్నింటిం గావించి రసికజనానురంజకముగా గీర్వాణభాషయందు నాటకరూపమున రచియించెను. కాళిదాసుని కవితామాధుర్యము కవులను పూర్వులను బలువురను హృదయంగమమై యాకర్షింప వారును యథామతిగా నించించుక మార్పులు గావించి యీకథనే రచించి కృతకృత్యులైరి. ఇప్పటికి మనకుఁ దెలిసిన ఆపూర్వకవులలో పెద్దనాగామాత్యుఁడు, కృష్ణకవి, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రయ్యయే ఈగ్రంథకర్త. ఈకవి యీగ్రంథమును, జైమినిమహాముని ప్రణీతమగు జైమినిభారతాంతర్గత అశ్వమేధపర్వమును ఆంధ్రీకరించినాఁడు. ఈగ్రంథమును రచించుటకుఁ బూర్వమే 1 నవరసదర్పణము, 2 నారదీయము, 3 మాఘమాహాత్మ్యము, 4 మానసోల్లాసము మొదలగు గ్రంథములను రచించినట్లు తానే యిందు చెప్పికొనియున్నవాఁడుగాని అవి యిపుడు గానరావు.

మ-రా-రా-శ్రీ, కందుకూరి వీరేశలింగముపంతులుగారును, మ-రా-రా-శ్రీ, గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారును తమ రచించిన కవిజీవితంబుల ఆధారంబులఁ బెక్కింటిం జూపి యీకవి శ్రీనాథమహాకవికాలమువాఁడని నిర్ణయించిరి.

ఈకవి నియోగియా వైదికియా యని యొకవాదము గలదు. కం. వీరేశలింగముపంతులుగారును గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారును ఈకవి నియోగి యనియే వ్రాసిరి కాని అందులకుందగిన యాధారములఁ జూపరైరి. గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు ఈకవిగోత్రమును నిర్ణయించుచో 'కవులంబంకజగర్భసన్నిభుల' అనుపద్యమునంగల 'మానన్నయభట్టు' అనుమాటను ఆధారించుకొని, భారద్వాజసగోత్రుఁడని చెప్పినారు. ఇట్లు 'మా' యని బంధుత్వము కలిపికొనుటకు గోత్రమేనా ముఖ్యకారణము ? తెగ ఏలకారాదో తెలియరాకున్నది. సరస్వతీపత్రికాధిపతులు తాము వ్రాసిన శృంగారశాకుంతలపీఠికలో నీకవి వైదికియనియే సయుక్తికముగఁ జెప్పినారు.

కం. వీరేశలింగముపంతులుగారును గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారును ఈకవి నివాసస్థానము దెల్పినారు కారు. సరస్వతీపత్రికాధిపతులు బిట్రగుంటకు సమీపముననుండు సోమరాజుపల్లిలో తత్ప్రాంతగ్రామములో యీకవి నివాసస్థాన

మని యీగ్రంథమునుండియే 'లవణాబ్ధివేలా' యనుపద్యమునే ఉదహరించిరి. పిల్లలమఱ్ఱి యనుగ్రామము నైజాముసంస్థానమందుఁ గలదనియు నీకవి గృహనామము పిల్లలమఱ్ఱి యగుటచే నీకవి నైజాముదేశస్థుఁడుకాని నెల్లూరు ప్రాంతమువాఁడు కాఁడని యిటీవల ఒకవాదము లేచినది. గృహనామమును గ్రామనామమును కాకతాళీయముగా సరిపడినంతమాత్రాన ఆగృహనామముగలవారెల్లరు అందే జనించియుందురనుట ఎంతవరకు విశ్వసనీయమో ఎఱుఁగము.

మహాకవి శ్రీనాథుఁడు ఈకవితోడఁ దాను నైషధమును ఆంధ్రీకరించినట్లు చెప్పెనఁట. వీరభద్రయ్య "అయ్యా, 'గమికర్మీకృతనైకనీవృతః' అనువాక్యమును ఆంధ్రీకరించితి వెట్లు" అని యడిగెనఁట అంత శ్రీనాథకవి 'గమికర్మీకృతనైకనీవృతుఁడనై' యని యాంధ్రీకరించితి ననెనఁట. 'నై' యొకటియేగదా నీయాంధ్రీకరణము అని పినవీరభద్రుఁడు ఆక్షేపింపఁగా శ్రీనాథునికి శృంగభంగమాయెనని శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసిరి.

శ్రీరామమూర్తిపంతులుగారు వ్రాసినట్లు పినవీరభద్రుఁడు శ్రీనాథుని నాక్షేపించెననుట సందేహాస్పదము. నైషధమునందలి పద్యములంబోలిన పద్యములు ఈశాకుంతలంబునం గానంబడుచున్నవి. దిక్ప్రదర్శనంబుగఁ గొన్నింటిం జూపెద.

| | |
|---|---|
| శృం. శా. | శృం. నై. |
| ప్ర. ౧౦ | ప్ర. ౭ |
| ప్ర. ౩౯ | ప్ర. ౩౫ |

ఇంతియకాదు. పినవీరభద్రుఁడు తనకు కవుల యెల్లరినేర్పును గలదని చెప్పికొనినపద్యమందు 'శ్రీనాథభట్టభాషానిగుంభంబుల పరిమళంబులఁగూడఁబఱచనేర్చు' అని శ్రీనాథకవినిగూర్చి చెప్పుటచే నీకవికి శ్రీనాథునియందుఁ గలగౌరవము చాటుచున్నదేకాని శ్రీనాథకవిని అపహసించినట్లు తోఁచదు.

ఈకవి కాళిదాసు శాకుంతలమునే మాతృకగాఁ గొని రచించినవాఁడుగాఁడు. అట్లే భారతకథను తనగ్రంథమునకు మాతృకగా గొనినవాఁడు గాఁడు. అటనుండియు నిటనుండియుఁ గథాంశములను గ్రహించి తనకు హృదయంగమమని తోఁచిన మార్పులను గావించుచు గ్రంథమును నిర్వహించినాఁడు. చూడుఁడు, భారతమున శకుంతలయే తనవృత్తాంతము చెప్పికొనినది. అభిజ్ఞానశాకుంతలమున ప్రియంవదా అనసూయలు శకుంతలావృత్తాంతమును జెప్పిరి. ఇందు కణ్వమునీంద్రుని యంతేవాసి శకుంతలావృత్తాంతమును జెప్పెను. భారతమున ప్రియంవదా అనసూయల ప్రస్తావన

ఱే లేదు. శాకుంతలనాటకమున ఆదినుండి శకుంతల దుష్యంతునికడకుఁ బోవుటకై బయలువెడలి ఆశ్రమోపాంతము చేరునంతవరకు వెంటనంటివచ్చి మరలిరి. ఇందు దుష్యంతుని యాస్థానికి సైతము ప్రియంవదా అనసూయలు పోయి దుష్యంతునితో సంభాషింతురు. భారతమున అంగుళీయకశాపవృత్తాంతములుగానరావు. నాటకమునఁ గలవు. అంగుళీయకము మాత్రము శకుంతలవ్రేలినుండి జారిపడి పోయి దుష్యంతునికి బెస్తవానిమూలకముగాఁ జిక్కును. ఇందు ఆప్రస్తావనలునుగలవుగాని శకుంతలవ్రేలి యందే యుంగరముండును. కావుననే కవి యిట్లు చెప్పికొనియున్నాఁడు. 'భారత ప్రోక్తకథ మూలకారణముగ కాళిదాసుని నాటకక్రమము కొంత తావకోక్తికి అభినవశ్రీవహింప' అని

'అహో మేసౌభాగ్యం' 'కోహంరండే' ఇత్యాదిగాఁ గాళిదాసమహాకవింగూర్చి చెప్పెడికథకు అనుగుణముగా నీకవియు 'పొసగన్నేఁగృతి చెప్పఁగా' 'వాణీనారాణీ' యని చెప్పికొనియున్నాఁడు. ఈకవి కవనము అతిమనోజ్ఞమై పాఠకులకు హృదయ రంజకముగానున్నదనుట అతిశయోక్తిగాదు. కవిత్వము లక్షణవంతమైన దనుటకు లాక్షణికులు పలువురు నీకవిగ్రంథములనుండి పద్యములను తమలక్షణములకు లక్ష్యములుగా గ్రహియించుటయే నిదర్శనము.

ఈకవి అభిజ్ఞానశాకుంతలమునుండి కొన్నిశ్లోకములు ఆంధ్రీకరించినాఁడు.

వానిమాధుర్యమును వర్ణించుటకంటె వానిని చదువరులకే వదలుట మంచిదని తలచి కొన్నింటికి గమకములం జూపెదను.

| శృం. శా. | అ. శా. |
|---|---|
| ప్ర. పూనిచరా. | ప్ర. యాసృష్టిః. |
| ద్వి. దరిసెనపువ్వు. | ప్ర. ఇదంకిలా. |
| సందియమేల. | అసంశయం. |
| వనితఁజందన. | చలాపాంగం. |
| కొనకొని. | ద్వి. అనాహో. |

తండయార్పేట.
చెన్నపట్టణము.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# శకుంతలాపరిణయము

## ప్రథమాశ్వాసము.



వత్సాంకుఁడు భక్తవత్సలుఁడు లక్ష్మీప్రాణనాథుండు రా
జీవాక్షుండు సమస్తభూతభువనక్షేమంకరానేకరూ
పావిర్భావుఁడు వాసుదేవుఁ డనుకంపావాసుఁడై దానవి
ద్యావిఖ్యాతుని మంత్రివెన్నని నితాంతశ్రీయుతుం జేయుతన్. 1

సీ. పూని చరాచరంబు భరించు నొకమూర్తి యుడుపుఁ దృష్ణాఖేద మొక్కమూర్తి
యారగించు మనోజ్ఞమగు హుతం బొకమూర్తి యొసఁగుఁ జైతన్యంబు నొక్కమూర్తి
యాదిత్యులకుఁ ద్రోవరై పొల్చు నొకమూర్తి యుడుగణంబుల నేలు నొక్కమూర్తి
విశ్వంబుచీఁకటి విరియించు నొకమూర్తి హోతయై దీపించు నొక్కమూర్తి
తే. యరయ నెవ్వని యందు నయ్యష్టమూర్తి, యిష్టఫలదాత కరుణాసమేతుఁ డగుచు
వెలయఁ జిల్లర నాగయవెన్నమంత్రిఁ, జిరతరైశ్వర్యసంపన్నుఁ జేయుఁగాత. 2

శా. చేయు న్విశ్వము నెవ్వఁ డంచితకళాశిల్పం బనల్పంబుగా
వ్రాయుం బ్రాణులఫాలపట్టికల నెవ్వం డధ్వావర్ణంబు లా
మ్నాయవ్రాతము లూర్పు లెవ్వని[1]కి నయ్యబ్జాతగర్భుండు దీ
ర్ఘాయుష్మంతునిఁ జేయు నాగవిభువెన్నామాత్యచూడామణిన్. 3

మ. జననీస్తన్యముఁ గ్రోలుచుం జరణ[2]కంజాతంబునం గింకిణీ
స్వన మింపారఁగఁ దల్లిమేన మృదులస్పర్శంబుగాఁ దొండ మ
ల్లన యాడించుచుఁ జొక్కు విఘ్నపతి యుల్లాసంబుతో మంత్రివె
న్ననికి న్మన్నన సొంపు మీఱ నొసఁగు న్భద్రంబు లెల్లప్పుడున్. 4

సీ. పగడంపుఁ జిగురుజొంపము సొంపు విహసింపు కడు నొప్పుఁ గుఱుచకెంజడలవాఁడు
విదియచందురుతోడ వీడుజోడాడెడు రమణీయదంష్ట్రాంకురములవాఁడు
సీధుపానక్రీడఁ జెంగల్వపూఁజాయఁ దొంగలించెడు కన్నుదోయివాఁడు

---

1 కి నానాళీక; కగున్ దత్స్వర్ణగర్భుండు. 2 సంచారంబునన్.

క్రొత్తనీలాలరంగునకు నింపుక మించి మెఱుఁగారు నల్లని [1]మేనివాఁడు
తే. పృథివి కవతంసమణి యైనవిట్టుగుంట, దానకంబుగ నవతారమైనవాఁడు
భైరవస్వామి సకలసంపదల నొసఁగి, మనుచుఁ జిల్లరవెన్నయామాత్యవరుని. 5

ఉ. మెచ్చగువిచ్చుదమ్మిపువుమేడలలోన నిధానదేవత
ల్వచ్చి కటాక్షసంజ్ఞకుఁ గెలంకులఁ గొల్వఁగ నోలగంబు సొం
పచ్చగనుండు చంద్రముఖి యాదిమలక్ష్మి వసించుఁ గావుత
న్మచ్చిగ వెన్నయప్రభుని మందిరరాజమునందు నిచ్చలున్. 6

మ. పొసఁగ న్నేఁ గృతిఁ జెప్పఁగాఁ బరిమళంబు ల్చాల కొక్కొక్కచోఁ
గొస రొక్కించుక గల్గెనేనియును సంకోచంబు గాకుండ నా
రసి యచ్చోటికి నిచ్చుఁగాత పరిపూర్ణం బొంద వాగ్దేవి యిం
పెసలారం దనవిభ్రమశ్రవణకల్హారోదయామోదముల్. 7

శా. అర్థి న్నామక మానసాబ్జమున నధ్యాసీనుఁ గావించి సం
ప్రార్థింతు న్యతిసార్వభౌముఁ బరమబ్రహ్మానుసంధాత నా
నార్థాలంకృతబంధురశ్రుతిరహస్యజ్ఞాత శ్రీభారతీ
తీర్థశ్రీచరణంబు నుల్లసితముక్తిప్రేయసీవల్లభున్. 8

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి. 9

సీ. వల్మీకసంభవ వ్యాసమానీంద్రులవాణి కంజలిబంధపాణి యొసఁగి
భట్టబాణమయూరభట్టారకుల మంజుభాషావిశేషంబుఁ బ్రస్తుతించి
భవభూతిశివభద్రబంధురభారతీహేలావిలాసంబు నిచ్చగించి
మాఘభారవులనిరాఘాటచాటుసరస్వతీపుణ్యగౌరవముఁ దలఁచి
తే. లల్లటుని గాళిదాసు సోమిల్లకునిని, భామహుని దండి వామను భాసు హర్షు
హర్షసంపూర్ణహృదయుఁడనై కవిత్వ, సమధికస్ఫూర్తికై భక్తి సంస్తుతించి.

క. ఇట్టల మగుమతి భారత, ఘట్టమునకు నడవయచ్చుఁ గట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ, భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్. 11

గీ. ఉభయకవిమిత్రు నత్యంతశుభచరిత్రు, భానుసమతేజుఁ గొమ్మయప్రభుతనూజు
సుకృతవిభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ, బ్రణుతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి.

వ. ఒక్క ప్రబంధంబు రచియింపఁ బూనియున్నంత. 13

సీ. సకలభూపాలకాస్థానసౌధంబుల వర్ణింతు రేమంత్రి వాగ్విభూతి
సంతానసురధేను చింతామణులపెంపు ధట్టించు నేమంత్రి దానమహిమ

1. మేనువాఁడు.

యాశాంతదంతిదంతాఘాటములమీఁద విహరించు నేమంత్రివిమలకీర్తి
సుకవిగాయకబహుస్తుతిఘోషణంబున నలరు నేమంత్రి గేహాంగణంబు
తే. వాఁడు కౌండిన్యగోత్రాభివర్ధనుండు, మదవదరిసైన్యపతిమానమర్దనుండు
నాగయామాత్యతనయుండు నయవిశేష, విజితసురమంత్రి చిల్లరవెన్నమంత్రి. 14

వ. ఆమంత్రిమందారం బొక్కనాఁడు పురాణేతిహాసప్రసంగంబుల వినోదించుచుఁ దన
మనంబున. 15

శా. నల్లిల్లుం గుడియు న్వనంబును నిధానంబుం దటాకంబు రం
జిల్లుం గొండొకకాల మేగ నవి విచ్ఛేదంబునుంబొందు నే
పొల్లుం బోనిది కీర్తికిం గృతియపో భూమండలిం దానికిం
దెల్లం బిప్పుడు రామభారతకథాధీనప్రబంధావళుల్. 16

సీ. వల్మీకసంభవువాక్యసంపన్నత దశరథాధీశనందనునికీర్తి
సాత్యవతేయువాచావిలాసంబునఁ గౌంతేయపంచకాగ్రణిప్రశస్తి
చిత్తపవచనరాజినిబంధనంబున దారమహాపురాధ్యక్షుమహిమ
కాళిదాసవచోవిశాలతాప్రౌఢత విక్రమాదిత్యభూవిభునిచరిత
తే. మఱియుఁ దత్తత్కవీంద్రసముగ్రవాగ్వి, భూతిఁ దెలుపుచునున్నది పూర్వరాజ
శీల దానాదిచర్యావిశేషములను, గీర్తిసదనంబు కృతియ తర్కింప ధరణి. 17

క. ఆచంద్రతారకంబుగ, భూచక్రమునందుఁ గీర్తిఁ బోషింపఁగఁ దా
రోచిష్ణు వగుప్రబంధము, వైచిత్రి యొనర్చు సుకవివరుఁడు గలిగినన్. 18

సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢవాసనా సంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కనయజ్వవాగ్భక్కికామోదంబు చెలువు కర్ణముల వాసింప నేర్చు
నాచిరాజుని సోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబుల గూడఁబఱచ నేర్చు
తే. మహితగుణశాలి పిల్లలమఱ్ఱివీర, నార్యుఁ డాయింటఁ బైతామహంబగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి, యఖిలసత్కవినికరంబు నాదరింప. 19

క. ఆసుకవిచేత శివభజ, నాసక్తునిచేతఁ గశ్యపాన్వయుచేతన్
భాసురనవకవితాల, క్ష్మీసదనునిచేత వలయుఁ గృతిఁ జెప్పింపన్. 20

మ. అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గా
దనకుం బుత్త్రుని వీరభద్రపదపద్మధ్యానశుద్ధాంతరం
గుని నన్నుం బిలిపించి లోనఁ దనకోర్కు ల్సందడింపంగ మ
న్నన దైవాఱఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్. 21

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి నవ[1]రసదర్పణం బభినవముగఁ (?)
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీయము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసిత శయ్య
తే. భారతీతీర్థయతిసార్వభౌమగురుకృ, పాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవముఁ గాంచినాఁడవు కవులచేత, విపులచాటూక్తి నిర్నిద్ర వీరభద్ర. 22

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలన నాకు, వేడ్కనడిగెదఁ గవులెల్ల వేడ్కపడఁగ
షట్సహస్రకులోద్భవసచివులందు, సుకృతిగాఁ జేయు నాకొకసుకృతిఁ జేసి. 23

శా. ప్రఖ్యాతంబన మిశ్రబంధ మన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగువస్తువందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం [2]బితివృత్తమైన కృతిచెప్ప న్వక్తను న్శ్రోతను
న్విఖ్యాతిం గలిగింతుఁ బుణ్య[3]మహిమ న్విశ్వంభరామండలిన్. 24

క. శృంగారము ముఖ్యంబగు, నంగియు నంగములుఁ దలఁప [4]నష్టరసములు
న్సాంగ మగునేని డంకము, బంగారముతోడి యొఱ ప్రబంధము వోలెన్. 25

గీ. కథప్రసిద్ధయు మిగుల శృంగారవతియుఁ, బరిగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథితయైన శకుంతలాఖ్యానభంగి, నని ప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతినొంద. 26

సీ. [5]సరసపువ్వులుగ మాలకరి పెక్కుతెఱఁగుల విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూరకస్తూరికావస్తువితతిచే శ్రీఖండచర్చ వాసించినట్లు
ఒడికంబుగా గందవొడికి నానానూన పరిమళంబులు గూడఁబఱచినట్లు
సరఘలు వివిధపుష్పమరందలవములు గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు
తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ, గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీ వహింపఁ, గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు. 27

వ. అని సవినయంబుగాఁ గర్పూరతాంబూలంబు జాంబూనదపాత్రంబున నర్పించి ప్రార్థించినఁ దద్వచనప్రకారంబున మిశ్రబంధంబుగా శాకుంతలం బను ప్రబంధంబు బంధురప్రీతిం జెప్పఁబూనితి నేతత్ప్రారంభంబునకు మంగళాచారంబుగాఁ గృతినాయకుని వంశావతారం బభివర్ణించెద. 28

క. ఖండేందుధరసమాను న, ఖండతపోరాజ్యసమధిగతపీఠస్థుం
గౌండిన్యుఁ జెప్పఁదగుముని, మండలమకుటావతంసమాణిక్యంబున్. 29

---

1 రతా (తౌర). 2 బది. 3 గరిమ. 4 నవ్య. 5 సరవిఫుల్లల.

శా. తద్వంశాంబుధిఁ గల్గె మేడనసుధాధాముండు భూమండలి
న్విద్వత్సన్నుతశీలి యాచకసురోర్వీజంబు దిక్పాలయో
షిద్వక్షోరుహహారమౌక్తికమణిశ్రేణీలసత్కీర్తి జం
బూద్వీపావనిపాలమంత్రివిభవాంభోజాతపీచంద్రుఁడై.

ఉ. భూనుత వైభవస్ఫురణఁ బొల్పు వహించిన సోమరాజుప
ల్లీనగరామరావతికి లేఖపమంత్రియుఁ బోలె నీతివి
ద్యానిపుణత్వ మొప్పఁగఁ బ్రధానులలో నుతికెక్కె భామినీ
మీనపతాకమూర్తి యగు మేడన రాజులు గారవింపఁగన్. 31

సీ. లవణాబ్ధివేలహేలాకాంచి యగునంధ్రధరణిమండలికి ముత్యాలజల్లి
సంగ్రామపార్థరాజన్యరాజ్యశ్రీకిఁ బెంపుమీఱిన జగజంపువెల్లి
దాతలు సముదంచితప్రసూనములుగాఁ గామితార్థము లిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గువిద్యలకు నపూర్వఘంటాపథం బైన పట్టణముతల్లి
తే. పంటనృపకౌస్తుభములకుఁ బాలవెల్లి, కదనజయలక్ష్మి తొలుచూలుఁగన్నతల్లి
విపులభుజగర్వదర్పితవిమతరాజ, రాజిహృద్భల్లి ధరసోమరాజుపల్లి. 32

క. ఆనగరము పైతామహ, మైన నిజస్థానముగ సముంచితలక్ష్మిం
దానొంది మంత్రి మేడన, జానుగ భజియించె సప్తసంతానము[1]లన్. 33

క. ఆమేడనమంత్రికి సా, ధ్వీమణి మాచాంబకున్ శ్రుతిత్రయముగతి
న్రామత్రయంబు పోలిక, నాముష్యాయణులు గలిగి రనుపమతేజుల్. 34

వ. అందు. 35

శా. దుగ్ధాంబోధిగభీరు రూపజితచేతోజాతు నుద్యత్ప్రభా
రుగ్ధాముం గరుణాభిరాము ధృతిమేరుక్ష్మాధరంబు న్సుధా
దిగ్ధస్వాంతు నితాంతదానసురపృథ్వీజాతము న్బాంధవ
స్నిగ్ధుం జిల్లర యెఱ్ఱయప్రభుమణిం జెప్పందగుం బెంపునన్. 36

శా. ఆయెఱ్ఱయ్యకుఁ గూర్మితమ్ముఁ డగువెన్నాఖ్యుండు ప్రఖ్యాతిగా
మ్రోయించె న్నృపహూదేశభూవరసభామూర్ధంబులం దుల్లస
త్సాయంకాలనటన్మహానటజటాసంఘాట[2]ధాటీవశ
త్తోయస్ఫాలనఫక్కికానఘయశస్తుత్తుంభనిర్ఘోషమున్. 37

వ. తదనుసంభవుండు. 38

---

1 లన్. 2 వాటీ.

సీ. గౌతమమునినాథుచేత నొప్పరి మేను వికృతి నొందనినాఁడు వేల్పుఱేఁడుఁ
బెండ్లిలో గిరిజాస్యబింబంబుఁ జూచుచోఁ దాల్మి వీడనినాఁడు తమ్మిచూలి
కలశపయోరాశి చిలుకుకవ్వపుఁ గమ్మకుంది కబ్బనినాఁడు మందరంబుఁ
గాళికావిభుని డాకాలితాటింపులఁ గములఁబారనినాఁడు కుముదహితుఁడు
తే. భోగధీధైర్యకాంతులఁ బోల్పఁబోలుఁ, గాని నాఁటికి నేఁడీడు గారవంగ
వెలసె వెన్నయయనుజుండు వినయధనుఁడు, త్యాగశిబిరాజు చిల్లరనాగరాజు. 39
క. ఆనాగసచివధీమణి, శ్రీనాయకుఁ డిందిరను వరించినకరణి
న్మానవతీతిలకముఁ బ్ర, ధ్వనుతగతిఁ బోతమాంబ వివహం బయ్యెన్. 40
ఉ. ఆపురుషావతంసమున కా[1]సుచరిత్రకు నుద్భవించి రు
ద్దీపితకీర్తి వెన్నయయు ధీనిధి మేడనయు న్సమస్తవి
ద్యాపరమేష్ఠి యాదెనయు ధార్మికుఁ డెఱ్ఱనయు న్సుధానుస
ల్లాపుఁడు వీరభద్రుఁడును లాలితనీతికళాధురంధరుల్. 41
వ. ఇట్లు సముచితదానసంచితకల్పతరుపంచకంబగు నాయామాత్యకుమారపంచకంబునందు
మ. కులపాథోనిధిపూర్ణచంద్రముఁడు దిక్కుంభీనహేలాకట
స్థలనీరంధ్రమదప్రవాహలహరీచక్రాంగసత్కీర్తిసం
దలిరాట్కుండలపూజనారతుఁడఖండశ్రీసమన్వీతుఁడై
వెలసెం జిల్లర వెన్నమంత్రి సకలోర్వీచక్రవాళంబునన్. 43
క. వెన్నయ కూరిమితమ్ముఁడు, సన్నుతచరితుఁడు సమస్తజనసమ్మతుఁ డ
త్యున్నతవాచావైభవ, పన్నగపతి మేడమంత్రి ప్రస్తుతికెక్కెన్. 44
ఉ. మేడన పేర్మినొందెఁ బుడమి న్నయసంపద దేవమంత్రితో
నీడన యాచకావళి కభీష్టపుటీగులకల్పశాఖికిం
జోడన ధీజనస్తుతవచోవిభవంబున శేషచక్రివాఁ
డోడన సాటిగా నతనితోఁ బెఱమంత్రులు జాడు బేడనన్. 45
శా. ఉన్నారెన్నిక కెందఱే సచివులత్యుచ్చోదరుల్పెసం
పన్నుల్వావలఁ గింకఁచానుల గణింపంబోరు వాగ్వైఖరు
ల్మిన్నుల్మోసివెలుంగుసత్కవిజను ల్మేడయ్య వర్ణింతురా
వెన్నామాత్యు ననుంగుఁదమ్ముని జగద్విఖ్యాతచారిత్రునిన్. 46
క. ఆతనియనుజన్ముండ[2]గు, నాతఁడు బుధవిబుధతరువు నలినదళాక్షీ
నూతనమదనుం డాదెన, భూతలము యశఃపటీరమున వాసించెన్. 47

---

1 సుచరిత్రనకుద్భ. 2 ధు, నాతన.

ఉ. ఆదినృపప్రధాను లెనయాదురుగాని సుధీగుణంబుల
న్మేదిని నేటివారి నుపమింప సమానులుగారు ధర్మస
మ్మోదికి సత్కళానివహమోహనవేదికి లోకహృన్ముదు
త్పాదికి మిత్రభృత్యహితబంధువినోదికి మంత్రియాదికిన్. 48

సీ. కులసమాగతధర్మగుణరక్షణమున సీతాకాంతు రెండవతమ్మునికిని
నవికారనవమోహనాకారమునఁ బురందరసూతి రెండవతమ్మునికిని
సన్నుతాశ్రాంతవిశ్రాణనంబునఁ బరేతస్వామి రెండవతమ్మునికిని
సుకృతసంధుక్షణాశోభితామలబుద్ధి దశకంఠు రెండవతమ్మునికిని
తే. ధరణి వెన్నయ్య రెండవతమ్మునికిని, సాటియనవచ్చు నవ [1]విలసద్గుణముల
నఖిలబంధుజనంబుల నాదరింప, సన్నుతివహించు నాదెన సచివవరుఁడు. 49

వ. తదనుసంభవుండు. 50

సీ. జలజసంభవుఁడు ప్రజ్ఞావిశేషంబున నిర్జరాచార్యుండు నీతిగరిమ
వాతాశనస్వామి వాచానిరూఢత ధర్మనందనుఁడు సత్య[2]ప్రశస్తి
జహ్నుకన్యాసూతి సచ్చరిత్రంబున శైలారి శంభుపూజనము కలిమి
జామదగ్న్యుఁడు ప్రతిజ్ఞాపాలనంబున సౌమిత్రి భ్రాతృవత్సలతపేర్మి
తే. వంశవనవాటి చైత్రుఁ డన్వయపయోధి, చందురుఁడు గోత్రజలజకాసారతిగ్మ
కరుఁడు కులనందనారామకల్పతరువు, మహితగుణశాలి యెఱ్ఱనామాత్యమాళి. 51

గీ. యెఱ్ఱనామాత్యు ననుజన్ముఁ డహిపభూష, ణాంఘ్రిపంకేరుహభ్రమరాయమాన
మానసుఁడు మానధనుఁ డసమానగుణుఁడు, వీరభద్రుండు వితరణ విబుధతరువు 52

ఉ. ఈజగ మెల్లనుం బొగడు నెప్పుడు నెన్నికచేసి నిత్యవి
భ్రాజితనీతిమార్గబలభద్రుని జాతకృపాసముద్రునిం
బూజితరుద్రుని న్వివిధపుష్పశరాసనకేలిభద్రుని
న్రాజితదానసంపదమరుద్రుని జిల్లరవీరభద్రునిన్. (?) 53

వ. ఇట్లు విశిష్టమాతాపితృజన్యులు నభినంద్యసౌజన్యులు నగువీరలయందు. 54

సీ. కూర్చుండుపయసునఁ గూర్చుండ నేర్చెను ననుదినత్యాగసింహాసనమునఁ
గొంకక నడ నేర్చుకొనుచుండి నడనేర్చెఁ దప్పక వేదోక్తధర్మసరణి
మాటలాడఁగ నేర్పు నాఁటనుండియు నేర్చెఁ బలుకంగ హితసత్యభాషణములు
చదువంగ వ్రాయంగ [3]సరవడి నేర్చియు నేర్చెను గార్యంబు నిర్వహింప
తే. వినయమున కాకరంబు వివేకమునకు, సీమ జన్మస్థలంబు దాక్షిణ్యమునకు
నాలవాలంబు విద్యల కరయ మూర్తి, మరుఁడు చిల్లరవెన్నయామాత్యవరుఁడు 55

1 లీల. 2 ప్రసిద్ధి. 3 సరవి నేర్చిననాఁడె.

చ. అతఁడు వివాహమయ్యె సముదంచితవైభవ మొప్పఁగాఁ బతి
వ్రత యగు భైరమాంబయును వర్ణితనిర్మలవాగ్విలాస వా
క్పతియగు సూరమంత్రియును భాగ్యఫలంబునఁ గన్న యన్నక
క్షితి ననసూయతోడ సరిసేయఁగవచ్చు సద్గుణాన్వితన్.

సీ. మాంగళ్యశృంగార మంగీకరించి వర్తించుచోఁ బార్వతీదేవిగుణ
నఖిలార్థులకును నిష్టార్థంబు లిచ్చి సంభావించుచో రమాదేవిగుఁ
హితమితోక్తులచేత నెదిరికిఁ బ్రీతి నొందించుచో భారతీదేవిగుఁ
బరమపాతివ్రత్యపరతమై పతిభక్తి గావించుచో శచీదేవిగుణము
తే. వరుస నేనోము నోఁచి యొప్పరసెఁగాక, సతుల కిట్టిగుణంబుల
యనఁగఁ బొగడొందెనుతబంధుజనకదంబ,యాస్యజితపూర్ణశశిబి

శా. శ్రీవత్సాన్వయసింధుజాత యగులక్ష్మిం బ్రీతి నన్నాంబికం
దేవింగా వరియించి యాపరమసాధ్వీమౌళిరత్నంబుతో
శ్రీవత్సాంకుఁడు వోలె వెన్నన ఘనశ్రీమంతుఁడై సత్కృతు
ల్గావించె న్నిజబంధుమిత్రతతికిం గార్హస్థ్య మొప్పారఁగన్.

సీ. రక్షించె బంధువర్గముఁ బ్రమోదం బంద నర్థుల కిచ్చె నిష్టార్థస
గట్టించె ఘనతటాకంబు లంబుధులుగా ధర్మకాననములు తెఱు
స్థిరసమున్నతి సంప్రతిష్ఠించె నల్లిండ్లు వరనిధానంబులు త్వరఘు
నన్నసత్రము లెడరైనచో సాగించె నోలిఁ జేయించె దేవోత్సవ
తే. సప్తసంతానవతిఁ జేసె జలధినేమిఁ, జేసె ధర్మంబు లెన్నేనిఁ జే
జేయుచున్నాఁడుసుకృతంబులాయతముగ,మనుజమాత్రుండెవెన్న

మ. వెలయుం జిల్లర వెన్నయప్రభుఁడు దా వేదోక్తసంసిద్ధి వే
ళ్లఁ బ్రాసాదపుఁబంచవర్ణమునఁ గాలగ్రీవుఁ బూజింపఁగా
నలవాటై మఱి యొండెఱుంగవు తదీయశ్రీనివాసంబునం
బలుకుం బంజరశారికాశుకములు న్బంచాక్షరీమంత్రమున్.

చ. విడువక సోమవారములు వెన్నన సేయఁగ వత్సలత్వ మే
ర్పడఁ దనుదాన వచ్చి నిజభక్తముఖంబుల నారగింపఁగాఁ
దడఁబడి 1పాక గంధములతావులు పూనిన షడ్రసంబులం
గడుగఁబడెం గళస్థవిషకల్మషమర్ధశశాంకమాళికిన్.

సీ. విలసితంబైనకావలివెన్నమారాధ్యమణిదత్త యగుశైవమంత్ర
సముధికస్ఫూర్తితో శాశ్వతైశ్వర్యబీజంబైన శంభుపూజాఫల

1 పోవ.

# ప్రథమాశ్వాసము.

ప్రమథాధిపతిఁ గూర్చి భక్తితోఁ గావించు సోమవారవ్రతసుకృతగరిమ
యన్నమాంబిక కంధరాంతరంబునఁ జాల శోభిల్లు మంగళసూత్రలక్ష్మి
తే. సకలసౌభాగ్యములకును సాధనములుఁ, గారణంబులుఁ దగుబోధకములుఁ
సచివసంఘంబులోనఁ బ్రశస్తిఁగాంచె, విశ్వనుతకీర్తి జిల్లరవెన్నమంత్రి.

## షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణగణ వి, ఖ్యాతునకును నిత్యఘనదయాన్వితునకుఁ
శ్రీతపదానందునకును, బోతాంబాగర్భజలధిపూర్ణేందునకుఁ.
క. శరనిధిగాంభీర్యునకును, బరహితకార్యునకుఁ దుహినపర్వతకన్యా
వరపదపంకజపూజా, కరికాలునకును నిరస్తకలికాలునకుఁ.
క. బాలామదనునకు రమా, హేలాసదనునకు బంధుహితజనరక్షా
శీలాయతమతికిని నిఖి, లేలాజనవినుతసురమహీధరధృతికిఁ.
క. కౌండిన్యగోత్రునకు ను, ద్దండాహితసచివమతిలతాదాత్రునకుం
బండితచింతామణికిఁ బ్ర, చండవచోవిభవవిష్ణుశయ్యాఫణికిఁ.
క. అన్నాంబికాసమంచిత, హృన్నలినాదిత్యునకు మహీదివిజానీ
కౌన్నత్యునకును జిల్లర, వెన్నామాత్యునకు సత్కవిస్తుత్యునకుఁ.
వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు నభీష్టఫలసిద్ధియుం గా నాశీర్వదించి నా
యొనరింప బూనిన శాకుంతలకావ్యకథాలతాలవాలం బగు పురీలలామంబు.
సీ. పద్మరాగోపలప్రాకారరుచిజాలగండూషితవ్యోమమండలంబు
పాతాళజలరుద్ధపరిఖాప్తకల్లోలసుకుమారపరిఘోపశోభితంబు
శక్రనీలశిలావిశాలగోపురరోచిరసమయజనితమిథ్యాతమంబు
కనకగోపానసీఖచితముక్తాఫల[1]రాజివిలగ్నతారాగణంబు
తే. రాజసదనాగ్రదేశవిరాజమాన, తోరణాలీనమణిగణద్యుతివితాన
విశ్వలక్ష్మీవిలంబిత విలసదింద్ర, చాపరుచిచాపలము హస్తినాపురంబు.
ఉ. ఆపురి నున్నతస్ఫటికహర్మ్యవిభాపటలంబు నింగి ను
ద్దీపితమై చెలంగ నిది దివ్యతరంగిణి యొత్తిపచ్చెఁ దా
నీపయిత్రోవనంచు బయలీఁదుచుఁ గోయఁదలంతు రగ్రసం
స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్.
మ. దివిఁ బ్రాకారము ముట్టియుండఁగఁ దదుద్దేశంబునం గోటతోఁ
దవులుం జక్రము నిక్కమంచుఁ బరిమీఁదన్రాక పార్శ్వంబులం

---

1 రాజీవ.

[1]గవఘుం ద్రోవ ననూరు యత్నమున రాఁగా నౌటఁ గాఁ బోలుఁ బో
రవి తేరు త్తరదక్షిణాయనములం బ్రాపించి దీపించుటల్. 71

శా. ప్రాసాదోపరి నాట్యశాలికలపైఁ బద్మానన ల్నర్తనా
భ్యాసక్రీడ లొనర్పఁ [2]దద్భ్రమిరయవ్యాయామజంబైన ని
శ్వాసామోదముఁ బ్రోదిసేయు నికటస్వర్వాహినీకూలకు
ల్యాసంవర్ధితకేసరప్రసవమధ్యాసారసౌరభ్యముల్. 72

చ. మెలఁతుక లప్పురి న్నిడుదమేడలఁ గ్రీడలు సల్పుచుండి మిం
చులు జళిపించు కన్గవలసోరణగండ్లను జూడ నీడగుం
దెలుపును నల్పుఁగూడ నెడ త్రెవ్వనిచూపులఁ గైరవంబులుం
గలువలు దోరణావళులు గట్టినయోజలరాజవీథులన్. 73

క. పురికోటరత్నదీప్తుల, నరుణములై చుక్క లుండ నంగారకునిం
బరికించి యందుఁ దెలియక, కరము విచారింతు రెంత[3]కార్తాంతికులున్. 74

క. పరిఘుజలంబులు మొదలను, సురనదినీరాడుపరికె చుట్టుననుండం
బురికోట లగ్గవట్టఁగ, నరిది వితర్కింప వాసవాదులకైనన్. 75

చ. శ్రుతి గవుడొందినం గమలసూతికినైనను దీర్చి చెప్పనే
రుతురు పురాణశాస్త్రములు ప్రొద్దున నిండ్లను గీరశారికా
తతులు పరీక్షలీ విని ముదంబును బొందుదు రింద్రుపట్టముం
గ్రతువులు వేయొనర్చినను గైకొన రప్పురి విప్రసత్తముల్. 76

ఉ. మందరగోత్రధీరు లభిమానధను ల్పరభేదివచ్చినం
గ్రిందుపడంగ నేరనియరిందము లంచితనిత్యభోగసం
క్రందను లాత్తరక్షణపరాయణు లంబుజలోచనాశుక
స్యందను లర్థిలోకహరిచందను లాపురిరాజనందనుల్. 77

ఉ. వెచ్చము పెట్టుమన్నఁ బదివేలకు నుద్దరు లొల్ల రర్థము
ల్దెచ్చిన శేషు నౌదలల దివ్యమణు ల్వలెనన్న విల్వలన్
హెచ్చును గుందు నాడుకొన కిత్తురు లాభముఁ గోర కెన్నఁగా
నెచ్చటఁ గోటికిం బడగ రెత్తనివైశ్యులు గల్గ రప్పురిన్. 78

క. సంగరము లేక యుండిన, సింగంబులఁ బులుల సమదసింధురములనే
కాంగిఁ దొడరి పడవైతురు, పొంగునఁ దమ కుబుసుపోక పురి వీరభటుల్. 79

1 గవడుం, గవుడుం (చూ 76 ప.) 2 దద్భ్రమర. 3 కార్తాంతికులన్.

శా. పక్షంబుల్ మును శాలిహోత్రుఁడు శపింపం బోయినం బోవనీ
శిక్షానైపుణి నర్కతేజుల నధిక్షేపింపఁగాఁ జాలిన
ట్లక్షీణత్వర నింగినైన గతిసేయంజాలు నుచ్చైశ్శ్రవ
స్సాక్షాత్కారము లప్పురిం దురగముల్ ఝంపాకళాసంపదన్. 80

మ. గణనాతీతములై సురేంద్రుఁ డెలక ల్ఖండింప వజ్రాయుధ
ప్రణరక్తం బన బిందువుల్ వొడమగా వర్తిల్లు జాతవ్యథా
క్వణనంబై పటుబృంహితంబులు చెలంగ న్సామ్య మొందింపఁ బ
ట్టణమార్గంబునఁ బడ్డ పెద్ద నడగొండ ల్వోలె శుండాలముల్. 81

సీ. హరినీలరుచుల నీలాలకంబులు గావు చిత్తజు మధుపశింజినులు గాని
క్రొన్నెలవంకలాగుల భ్రూలతలు గావు విషమాస్త్రు తియ్యని విండ్లు గాని
యలసంబులైన వాలారుఁ జూపులు గావు రతిరాజు మోహనాస్త్రములు గాని
బంధురస్థితిఁ బొల్చు కంధరంబులు గావు కందర్పు విజయశంఖములు గాని
తే. నలినదళలోచనలు గారు నడుమ నేర్చు, కంతునవశస్త్రిశాలలు గాని యనఁగ
నంగకంబుల సౌభాగ్య మతిశయిల్ల, నారసతు లొప్పుదురు పురవరమునందు. 82

చ. వెలకుఁ దగం బ్రసూనములు వేఁడుచు మార్వరికింప నెత్తులం
గలసి చిగుళ్లు వెట్టి యడకట్టిన క్రొవ్విరి మొల్లపూవు పై
త్తులు దశనాధరద్యుతులఁ దోఁచినఁ బైకొసరీవిగా విటు
ల్వొలువగ వారిచిత్తములు విల్తురు తత్పురి పుష్పలావికల్. 83

మ సరసుల్ చొచ్చి సరోజకోటరకుటీసంవర్తికా చారు కే
సరగుచ్ఛంబులు గ్రొచ్చి బాహ్యవనపుష్పశ్రేణి నిర్యన్మధూ
త్కరముం దెచ్చి తదీయ సౌరభము లుద్గారింపుచు న్సంతత
స్మరసంజీవనమై చరించుఁ గలయ న్మందానిలుం డప్పురిన్. 84

గీ. శశవిషాణంబు గగనపుష్పంబు నైన, వణిజు లిండులలో విలువంగఁ గలవు
హంసగమనల మధ్యంబునందుఁ దక్క, లేమి యేవస్తువులయందు లేదు పురిని. 85

వ. ఇత్తెఱంగున సమస్త వస్తువిస్ఫూతిఁ బ్రస్తుతివహించి పయఃపారావారంబు ననుక రించుచు సర్వతోముఖదర్శనీయంబును సదాగతిసంచారసమంచిత బహులహరీమ నోహరంబును సంతతానంతభోగలీలాలాలితపురుషోత్తమోపేతంబును సమున్నత లక్ష్మీజనకంబునునై యమరావతియునుంబోలె శతమఖపవిత్రాయమానంబును నలకా పురంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబును మధురాపురంబునుంబోలె నుగ్రసే

సాభిరక్షితంబును నంతరిక్షపదంబునుంబోలె ననవరతమిత్రరాజసంబాధంబును బరమేశ్వరవామభాగంబునుం బోలె సర్వమంగళాలంకృతంబును మేరుమహీధరంబునుంబోలెఁ గల్యాణమహిమాస్పదంబును మహాకవి ప్రబంధంబునుంబోలె నుత్తమశ్లోకబంధురంబును రత్నాకరం బయ్యును గుట్టిమప్రదేశసుగమంబై ముక్తామయం బయ్యును భూరిక్షయోపేతంబై ప్రకటితపర్జన్యవైభవోదారం బయ్యును జిరప్రభాభాసురంబై మంగళాచారమహితం బయ్యును సౌమ్యపరిచారికాధిష్ఠితంబై యారూఢపాతివ్రత్యంబు క్రీడాకందుకంబులయందును బరిచితస్నేహనాశంబు రత్నదీపంబులయందును నీరసత్వంబు సముద్రంబులయందును ద్రాసదోషంబు పద్మరాగాదిమణులయందును యతినిబంధంబు పద్యంబులయందును దారిద్ర్యంబు విద్రుమాధరామధ్యంబులయందును బదచ్ఛేదంబు వాక్యంబులయందునుగాని దనయందుఁ గలుగదననొప్పు నప్పురంబు కప్పురంపుఁ దాళువాళించు సన్న సున్నంబుచేఁత లేఁత వెన్నెల నెమ్మించు గ్రొమ్మించులుం గలమేడలును విరాజితంబులగువాడలును రేయెండను మాఱుమండు పదాఱువన్నెబంగారుముద్దవరుస నద్దుకొనవైచి యద్దంబులమీఁదు నలె నుండ నున్నఁజేసి విన్ననువున మెఱుంగువెట్టినం ద్రొక్కిన జిక్కం జీరువారుచుం దళతళ వెలుంగు వేదులును విలసితంబులగు వీథులును బూర్వగిబునం బార్వతి యొఱింగిన తెఱంగగ్గిరికన్యచేతం బాణపుత్రి నేర్చినరీతి నారక్షోరాజి రాజనందనచేత ద్వారవతీగోపికాపికవాణు లభ్యసించిన బుద్ధి శుద్ధదేశినృత్తంబులు విశేషంబులు భిత్తిభాగంబులం జిత్తరువులం జిత్తరంజకంబులగుచుఁ బ్రత్యక్షభంగి నంగీకరించు విలాసలీలలను విలసిల్లు నాట్యశాలలును నాకవీఁక నాకసంబెక్క విశ్వకర్మ నిర్మించిన తాపురంబులఁ బోలుచు గోపురంబులమీఁదికి రాఁ బో సుసరంబులుగాఁ గట్టినం గారుకొనుమ నేచిన మేచకద్యుతులు పుక్కిలించు శక్రోపలసోపానంబు లన సాదనంబు లగు ప్రాసాదంబులును నుదంచచ్చంచరీక చక్రహంసక్రౌంచజలపక్షికులకలకలంబులం గొలకొలమను కొలంకులనలంకరించు పంకరుహకుముదకువలయకల్హారషండంబులం దండతండంబు లగు తావులం గదంబించు బావులును జిత్తంబు లుబ్బ గబ్బితనంబున విత్తంబు లొడ్డి నెత్తంబు లాడి యోడినధనంబు లాడినంగాని పెట్ట మనుదిట్టమాటలం బుట్టిన జగడంబులు విగడంబులై యుద్ధపతత్తంబు లగుపంతంబులఁ గుంతంబులం గొని వచ్చు జూదరిదట్టంబుల హెచ్చుగురచ్చకొట్టంబులును గలిగి వినోదంబులకు వాకరంబును విశ్రామంబులకు సీమయు విక్రమంబునకు నెలవును విజయంబునకుఁ దానకంబును విద్యలకు నుపాధ్యాయుయు వితరణంబులకు సదనంబును విభవంబులకుఁ బ్రభవస్థానంబును విలసనంబులకు వినిమయంబును నైన యప్పురి కధీశ్వరుండు.

సీ. విశ్వసన్నుతశాశ్వతైశ్వర్యపర్యాయకుటిలకుండలి రాజకుండలుండు
దిగిభశుండాకాండదీర్ఘబాహాదండమానితాఖిలమహీమండలుండు
జనసన్నుతానన్యసామ్రాజ్యవైభవశ్లాఘాకలితపాకశాసనుండు
కులశిలోచ్చయసానుకోణస్థలన్యస్తశస్తవిక్రమజయశాసనుండు
తే. భాసమాన మనీషాంబుజాసనుండు, సకలదేశావనీపాలమకుటనూత్న
రత్నసారజ్యదంఘ్రినీరజయుగుండు, శంబరారాతినిభుఁడు దుష్యంతవిభుఁడు. 87
మ. రజనీనాథకులావతంసుఁ డసిధారాదారితారాతిరా
డ్గజకుంభప్రణమార్గనిర్గళితముక్తారక్తహారుండు స
ద్ద్విజసంతర్పణకేలిలోలుఁ డఖిలద్వీపావనీపాల ది
గ్విజయాన్వీతుఁడు పాపభీతుఁడు మహావీరుం డుదారుం డిలన్. 88
మ. ప్రజలెల్లం జయవెట్ట ధర్మమహిమం బాలించె వీరారిభూ
భుజుల న్వేల్పులఁ జేసి యధ్వరములం బ్రోచెం బదాంభోజన
మ్రజనాధీశులఁ గాచి నిల్పె నిజసామ్రాజ్యంబుల న్సర్వసా
ధుజనస్తుత్యుఁడు సత్యకీర్తి యగు నాదుష్యంతుఁ డత్యున్నతిన్. 89
సీ. నిచ్చనఁ జేసె దోర్నిసితాసి కేరాజు దివి నేఁగు సమదపృథ్వీభుజులకుఁ
గల్పవృక్షముఁ జేసెఁ గరకాండ మేరాజు భూచక్రమునఁగల యాచకులకు
గేహాబ్జములు చేసెఁ గ్రేఁగన్ను లేరాజు చెలఁగి సంక్రీడింప సింధుసుతకుఁ
బూఁటకాపుగఁ జేసె భుజశక్తి నేరాజు ఫణిరాజుమోచు భూభరముఁ దీర్ప
తే. ననుచు వర్ణింపఁ దగదె శీతాంశువంశ, రాజహంసంబు దానధారాప్రవాహ
జలపరిక్షాళితాఖిల కలుషనికరు, సంచితాశ్రాంతకృపుని దుష్యంతనృపుని. 90
ఉ. ఆజననాథయూథమణియం దుదయంబును బొంది దిగ్జయ
వ్యాజమునం బ్రతాపనళినాప్తుఁడు కీర్తివిధుండు రాఁ దదు
ద్వేజితులౌటఁ గాదె పరివేషమిషంబున నాత్మగుప్తికై
యోజ నమర్చికొండ్రు రవియుం గమలారియు నింగి వప్రములన్. 91
సీ. ఆలానదండంబు హేలాహవాహూతరిపురాజధరణీకరేణువునకు
మానదండము మహామనుజేశగర్వాబ్ధిగంభీరతాపరీక్షావిధికిని
నాళదండము సమున్నతజయశ్రీవధూసముచితక్రీడాబ్జసౌధమునకు
నాధారదండంబు హరిణాంకకులభృజ్జనశుభ్రకీర్తిధ్వజంబునకును

తే. యష్టిదండంబు వృద్ధశేషాహిపతికి, మూలదండంబు సైన్యసముద్రతతికి
కాలదండంబు శాత్రవక్ష్మాపగతికి, బాహుదండంబుఁ జెప్పఁ దత్పార్థివునకు. 92

చ. జగమున రెండుతత్త్వములు శాస్త్రులు చెప్పుదు రందులోపలన్
జగడమ కాని యొక్కరయినం బొడఁగానరు వానిరెంటిలో
సగుణముఁ బట్టి నిర్గుణము శత్రువధూగళసీమలం జను
ల్వొగడఁగఁ జూపు నవ్విభుఁ డపూర్వముగా ఘనశాస్త్రపద్ధతిన్. 93

ఉ. పాయక శిష్టలోకపరిపాలనముం బహుదుష్టశిక్షయుం
జేయుచు రాజ్య మవ్విభుఁడు సేయఁగ దారు నిజప్రయోజనం
బేయెడలేక యున్న ధరియింతు రుదంచితలాంఛనార్థమై
తోయజనాభుఁడు న్రవిసుతుండు సుదర్శనకాలదండముల్. 94

సీ. చెఱుపనేరఁడు విశ్వసించియుండినవాని నభిలషింపఁగ నేరఁ డన్యవనిత
నిందింపనేరఁడు నీచశత్రుగణంబు బొంకనేరఁడు హాస్యమునకుఁ బలికి
విడువనేరడు చెడ్డవిటునిఁ జేపట్టినఁ గడపనేరం డర్థిగణమువాంఛ
నడుగువెట్టఁగనేరఁ డపయశం బగుత్రోవఁ జనఁగనేరం డార్తజనము విడిచి
తే. రైదు పదిసేయనేరఁ డాహవముఖమునఁ, గ్రించునందును నేరఁడు గీడొనర్ప
ననుచు నేరము లెన్నుదు రవనిజనులు, విపులయశుఁ డైన దుష్యంతవిభునివలన. 95

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు శుకతుండరోచిరుద్దామవిద్రుమస్తంభసంభార సమున్నతంబును హాటకమణివిటంకాలంకార విశ్రుతనిశ్రేణికాపదగమ్యమానచంద్రశాలోపకంఠంబును గంతేకాలకంఠమేచకరుచికచాకచిక్రీడాచతుర సితేతరపట్టపటలప్రాలంబముక్తాఫలవితానతారకితవియత్సీమంబును నత్యంతసమున్నతిమదుపరినిశాతశాతమన్యవశిలాశలాకానీలనీలచ్ఛర్ది విలగ్న వినూత్నరత్న కేసరస్తబకనిబిడబిసకనకకుముదారవిందసౌగంధికసందర్శితకపటగగనపుష్పంబును నభిరామమూర్వాదళి దామకోమలప్రభాపటలగర్వసర్వస్వపశ్యతోహరహరిదుపలభిత్తికాంతరజితరూపవాతాయనంబును వళక్షకిరణచ్ఛవిచ్ఛటావిస్ఫుట స్ఫటికపాషాణఫలకసోపానమార్గనిర్గమప్రవేశద్వారవిద్యోతమానవిపులతపనీయకవాటాలంకృతంబును నభ్రంకషశిరోభవనశిఖరస్థాపిత శాతకుంభకుంభకాంతిగండూషితనభోమండలంబును [1]ద్రయ్యంతరాస్తీర్ణవిచిత్రరత్నకుథాసనవిన్యాసంబుల శోభిల్లుసభాసౌధంబుననమూల్యరత్నకీలనజాజ్వల్యమానకల్యాణభద్రపీఠాంతరంబున నాసీనుండై యొక్కమంజువాణి వింజామరంబును నొక్క[2]జోటి పీటికాపేటికయు నొక్కబాలయాలవట్టంబును

1 రమ్యాంత. 2 (బోఁటి);

నొక్క కరటిగమన [1]సురఁటియు నొక్క లేఁజిగురాఁకుబోణి కాళంజియు నొక్క చందనగంధి గందవొడి బరిణయునొక్క పుండరీకనయన యగరుధూపధూమకరండంబును నొక్క కన్య పన్నీరుతోడి కప్పురంపుగిండియునొక్క భృంగాలకబంగారుసంగెడయు ధరియించి డగ్గఱి కొలిచియుండఁ బాండ్యపల్లవపాణి యాటలాడ భోటకరహాటకళింగాంగవంగబంగాళచోళ నేపాళకా[2]ది భూపాలక కుమారవర్గంబుం దగిన నెలవులం బలసి సేవింప హితపురోహితామాత్యబంధుమిత్రభృత్యపాఠక పీఠమర్దవిదూషకాదులు భజింప సుధర్మాంతరంబున నోలగంబైన దేవేంద్రుండునుం బోలె సాంద్రవైభవంబునం గొలువుకూర్చున్న యవసరంబున. 96

ఉ. జుంజురుపల్లవెంద్రుకల జొంపములుం గల మస్తకంబులుం
గెంజిగురాకుఁ గెంపుఁ దులకింపెడు వట్రుపకన్నులుం జర
త్కుంజరచర్మపట్టములకు న్సరిపచ్చు బెరళ్ల మేనులు
న్మంజులుగొల్వఁ గొందఱు సముద్ధతి వచ్చి పుళిందవల్లభుల్. 97

సీ. కాననేత్తువుల ముక్తములైన ముత్యాలు ముదిరిపండిన మంచి వెదురుఁబ్రాలు
దినములోఁ గ్రొత్త[3]యొత్తిన కజ్జజవ్వాది ముక్కలు మురియని [4]మొరళిపప్పుఁ
జంద్రికారుచిఁబొల్చు చమరవాలంబులుఁ బొందుగాఁ గాఁచిన [5]పూతిపదువు
అలఁతి దంతంపుఁ గాము పీలిసురఁటులు సోదించి పడిచిన జుంటితేనె

తే. కమ్మఁబిల్లులపిల్లలు కారుకోళ్లు, కన్నుదెఱపని కస్తురిగమిశిశువులు
పులులకూనలు భల్లూకపోతకములు, నాదిగాఁ దెచ్చి పతి కుపాయనము లిచ్చి. 98

వ. ప్రణామంబు లొనర్చి కేలుదోయులు ఫాలంబులం జేర్చుకొని వినయవినమితస్కంధులై క్రిందిచూపుల నిట్టతొరల వారం గనుంగొనుచున్నవారల నవలోకించి చిత్తంబు మృగయాయత్తం బగుటయు నృపోత్తముం డిట్లనియె. 99

క. దలముగ క్రొవ్విననృగములు, గలిగి సమీపమున నేఱుఁ గాలువ[6]యే దేఁ
గలిగి తఱచైన తరువులు, గిలిగిన పేరడవి యెచటఁ గలదు గణింపన్. 100

క. నావుడు వారలు విభుతో, దేవర వేఁటాడవలసి తే విచ్చేయం
గావలయును యమునాతటి, నీవరసీమంతికావనీవనమునకున్. 101

క. రోమము వెదకిన నెత్తురు, నామములేఁ దొడలు చమురునం జేసినయ
ట్లామృగ గవిసియుండును నా, [7]నాముఖ్యయూధంబు లవ్వనంబునఁ గలయన్. 102

గీ. ఊళ్లకూళ్లు సమీపమై యునికిఁ జేసి, లేళమైనను గొరనాఁగ లేమిఁ జేసి
యచటికొర్నెలఁ బసికి మేయంగఁ గలిమి, నగరి కీలార మున్నది నరవరేణ్య. 103

---

1 (సుర+అంటు) శ. ర. 2 రి?. 3 యొత్తిన 4 మొకరిపప్పు. 5 పూతిపఱవు.
6 యుం (లేక) యెం. 7 మృగ.

ఉ. జల్లెడ పాటువడ్డ యవసంబులు మేసి సమీపసీమలం
జల్లని నీరు ద్రావి సుఖసంగతి దాపులు గ్రేపు లాఁగఁ గాఁ
బొల్లగఁ జేరి గోవృషభము ల్మది కింపులుసేయ నుండియుం
బల్లిక బెబ్బులు ల్దిరుగ సాధ్వస మందును మందధేనువుల్. 104

ఉ. సాయక పుంఖితంబు లగుచాపములం ధరియించి యుక్కునం
బాయక రేయునుం బగలుఁ బాలెము వెట్టి మొకంబుఁ గన్నచో
నేయుచు బొంచి రాఁ దెఱపి యీక చరించుచునున్నమంద క
త్త్యాయతవర్ణసత్త్వ నినదావళి హాపలి మాన దెప్పుడున్. 105

గీ. కోలఁ బడినైదుగుదిగ్రుచ్చికొనఁగ నేయ, వచ్చు మృగముల నెమకంగవలన దచట
పసికి నయ్యెడు కీడు వాపంగఁగలదు, వేడుకను నిమ్ముగాఁగ వేఁటాడఁగలదు. 106

వ. అవల దేవరచిత్తంబు కొలఁది యనిన గోరక్షణంబుకొఱకును దుష్టమృగశిక్షణంబు వలన సుకృతంబుగా మృగయాసౌఖ్యంబు సిద్ధించె దేవరప్రసాదంబు జాదులుం బలె నయ్యెనని-యమాత్యుల యనుమతంబునం గొలువువిచ్చి యందఱ సముచిత ప్రకారంబుల వీడుకొలిపి వేత్రహస్తులం బిలిపించి పట్టణంబున మృగయావిహార సన్నాహంబునకుం జాటించిన: 107

సీ. పులిమల్లఁ డడవిపోతులరాజు గరుడుండు గాలివేగంబు పందేలపసిఁడి
విష్ణుప్రసాదంబు వేఁడిగుండులుపఁబడి పచ్చిమిరియము వెఱ్ఱిపుచ్చకాయ
వేఁటమాణిక్యంబు విరవాది సుడబల్మి పెట్టుఁగాఁడు పకారి పిడుగుతునుక
జిగురుండు చిత్రాంగి శ్రీరామబాణంబు పులియందు కస్తూరి బొడ్డుమల్లె
తే. యనఁగ మఱియును బెక్కుతోయముల పేళ్లు, దారకులు దేర వచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజవిగ్రహములు, వటుకనాథుని వాహ్యాళివాహనములు.

మ. శబరు ల్పట్టెడత్రాళ్లఁబట్టి తిగువం జండోద్ధతిం గిట్టి వ
ట్టిబయల్ ద్రవ్వుచు విద్వరాహముల గుండె ల్వ్రియ్య నాకాశముం
గబళింపం జనునోజ మోర లెగయంగా నెత్తి గర్జిల్లఁ గాఁ
బ్రబలెం గుర్కురకంఠనాళకుహరీభాభామహారావముల్ 109

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు, జాలె జలకట్టె కణుజు వేసడము బైరి
కురుజు లోరణ మను డేగ కోలము సాళు, వములఁ బిలుపును వేఁటకు వచ్చువాని.

సీ. బంగారు మెరవడి పల్లనంబులతోడఁ గెంబట్టు కీలుపక్కెరలతోడ
ముఖసమర్పితహాటకఖలీనములతోడఁ గాంచన గ్రైవేయకములతోడ
సుమకట్టిముడిచిన చామరంబులతోడఁ దాఁపఁబెట్టిన యడిదములతోడ
కనకఘంటలయురుగజ్జెపేరులతోడఁ గర్ణకీలిత దీర్ఘకళలతోడఁ

తే. చిత్రమున బ్రాయఁగారాని చెలువుతోడ, నొప్పి యుచ్చైశ్రవముతోడియుద్దులనఁగ
వాహకులు దేఱ వచ్చె గుర్వారలీల, వసుమతీనాయకుని పూజవారువములు 111

సీ. [1]పలనంబు పుట్టించి వంకంబు లొలయించి డిల్లాయి ప్రకటించి శేపమాపి
పరసంబు నొందించి [2]పల్లంబు కలిపెంచి నిగుడంబు సమకొల్పి నెఱనునెఱపి
లలిగూర్చి లలిదేర్చి లాగిచ్చి శుండాలముల నోజనట్టించి ఖలువుదెచ్చి
లవణిసంకోచంబులకుఁ దెచ్చి హస్తిణితో రససిద్ధిపడయించి రాగెలందు
తే. నాఱుతౌనకములను గృత్యమ్ములేదు, నరుపదేనాసనంబుల నెఱిఁగి హరుల
నెక్కురసికులువచ్చిరి హెచ్చునగరి, రాగరవుతులు సమరానురాగమతులు. 112

సీ. జడల్లి ముడిచి పాగడఁజొళ్ళెములు దీర్చి తలముళ్లు బలువుగా నెలవుకొల్పి
మృగముచేరఁగవచ్చు మొగసిరిచూర్ణంపుఁ దిలకంబు లలికసీమలఘటించి
వాకట్టువదినికెచేకట్టుమండలు కరకాండమధ్యభాగములఁ దొడిగి
కుఱుచగాఁ గట్టిన కరకదట్టీదిండు నంతరమ్మునఁ బిడియాలుదోపి
తే. పందిపోట్లును దడవిండ్లుఁ బొఱవాతి, యమ్ములును జిల్లకోలలు నడిదములును
వలఁతియూటెలు ధరియించి వచ్చి రంగ, రక్షకులు తాతతరముల ప్రాఁతవారు. 113

క. అరిగెలు నిష్ఠురబాహా, పరిఘులు ధరియించి నగరిపాలురు నేతెం
చిరి శిఖిపటుజిహ్వాసము, కరవాలద్యుతులు గగనకాలిమఁ గడుగన్. 114

శా. సింగంపుంబొది వచ్చుచందమున వచ్చెం బోయకాలారి యు
త్తుంగశ్యామలదేహసంజనితకాంతు ల్వీరలక్ష్మీనవా
పాంగచ్ఛాయలతోడఁ బెల్లొదవి మ్రోయ న్వేల్ల[3]దుద్యగ్ధ్భుజా
సంగత్వంగదభంగభంగురఘనుర్జ్యావల్లరీఝల్లరుల్. 115

గీ. ఉరులు జిగురుగండె దెరలును బోనులు, వారుహారెనలును వనులుగనులు
[4]మిళ్లువలలు పేట్లు గోళ్లు దీమంబులు, నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు. 116

వ. మఱియును మూలభృత్యబలంబును సామంత[5]కుమారవర్గంబును సర్వప్రకారంబుల
సముచితాలంకారులు సాయుధులు సవాహనులునై చనుదెంచి రప్పు డప్పుడమి
ఱేఁడు వేటఁకుం దగిన శృంగారం బంగీకరించి గతివిజితమరుత్తురంగంబు లగుతు
రంగంబులం బూనినయరదం బెక్కి యిరువంకల స్సింగలిం బింగలిం జతురంగబలం
బులుగొలువ శంఖకాహళవేణువీణామృదంగంబులు చెలంగ నెడలేక సందడిం గ్రం
దుకొన నమందవైభవంబునం బురందరవైభవుండు పురంబువెడలి వృద్ధహయంబు
మీఁద విదూషకుం డగుమాండవ్యుం డుదోడరాఁ గొంతద వ్వరిగి యొక్క చిక్కణ

---

1. పరసంబు. 2 వల్లంబు. 3 న్వేల్లనుద్య. 4 మళ్లు - పేళ్లు. 5 మంత్రి.

ప్రదేశంబున రథవేగంబుఁ దెలియువేడుక సారథింజూచి నిమ్నోన్నతంబులు
గాక యిచ్చట సమతలంబై యున్న యది నీహయంబులరయంబుఁ జూపుమనవుఁడు
నతండును యుగ్యంబులపగ్గంబులు వదల్చి యదల్చిన. 117

సీ. కనుదృష్టి నెయ్యది మినుమినుక్కను చుండు ఘనతవేల్పిడిలోనఁ గానఁబడఁగ
నెడత్రెవ్వియుండు నెయ్యదియేని నడికూడ నదికినచందాన నన్వయింప
నెయ్యది విలువంక యైయుండుఁ బదమున నదిసమరేకతో నందమంద
దూరాన నెయ్యది తోఁచు నాలోకింప నదిపార్శ్వమున లేక యవులఁ జనఁగ
తే. శ్రవణములు నిక్క నిష్కంపచామరాగ్రముగ నిరాయతపూర్వాంగములఁ దనర్చి
ఘనఖురోద్ధూతరేణువు గడవఁబాఱె, నిగిడె[1]భువి తేరిహయములు మృగజయములు.

వ. అయ్యవసరంబున. 119

గీ. కుక్కలలయకయుండంగఁ గొంచుఁబచ్చు, మంది యొకకొంతదిక్కు నాస్యందనంబుఁ
గూడి రారాక వడిచెడి కొంతదిక్కు, ననిలగతి నేగురథ మెవ్వఁ డంటఁగలఁడు.

క. సారథిఁ గనుఁగొని యపుడా, క్ష్మారమణుఁడు రథము దవ్వుగా వచ్చెఁ బరీ
వారము గూడదు రానె, వ్వారలు గల రిచట నిలుపవలయు ననుటయుఁ గా. 121

వ. అతండును నృపాలకానుశాసనంబునం దేజుల నేఁగనీక వాగెలు గుదియించి వీఁపు
లునిమిరి నిలుపుటయు సకలజనంబులుం గూడుకొని యుల్లసితయానంబున మెల్లన
చని మంద చేరంజన నయ్యవసరంబున విజయకాహళారావంబు లాలకించి బిరుద
ధ్వజవితానంబు లవలోకించియుఁ దమరాజురాకఁ దెలిసి నిసర్గభీరువులగు నాభీరు
వులు భీతచేతస్కులై నవీనం బగుహయ్యంగవీనంబుఁ గానుకతెచ్చి ప్రణామంబు
లాచరించి కరంబులు శిరంబునం బెట్టుకొని తిర్యగాలోలంబు లగుచూపులం గద్గ
దకంఠు లగుచుఁ బ్రస్ఖలితవినయవాక్యంబుల నిట్లని విన్నవించిరి. 122

సీ. దూరంబువచ్చినవా[2]రిట సైన్యంబు ప్రజలెల్లఁ జాల దూపట్టివారు
నీర్వట్టుగొని దీర్ఘనిశ్వాసములతోడ పరరథ్యములు వేళ్లవైచెఁ జెవులు
వేఁటకుక్కలు డస్సి వివృతాస్యముల నిల్చి వగరించుచున్నవి దగలుదొట్టి
శిథిలపక్షముల నక్షియుగంబులమోడ్చి శ్రమనొందె డేగలు సాళువములు
తే. తిమురు మధ్యాహ్నమయ్యెను దేవ యిచట, నేఁడు కా[3]లాఁగి మామందఁ బాఁడిచూచి
గోరసముఁ బాయసంబులు నారగించి, నిగ్రహంబైన మమ్ము మన్నింపవలయు. 123

గీ. అనుచు విన్నపమొనరించు నవసరమున, హయము డిగ్గిమాండవ్యుఁడు రయముతోడ
నవనిపాలునిరథము డాయంగవచ్చి, చేయి పుడిసిలిపట్టి యాశీర్వదించి. 124

---

1 విభు. 2 రౌట. 3 కాల్గాఁగి.

ఉ. ఒల్లమిచేసి వీరలకు నుత్తరమీకు నృపాలపెర్వ్వలుం
జల్లులునమ్ముకొన్నయవి చాలఁగ నున్నవి చిత్రధాన్యము
లొక్కల్లు త్రవ్వితండములు కుప్పలు నేతులు పాలువెన్నలుం
గొల్లలకేమియూఁడె మనకు న్నటి కూడొకపూఁట వెట్టినన్. 125

క. కానికకప్పము వెట్టరు, మానముదప్పఁదని క్రొవ్వి మనుబోతులసం
తానమువలె నున్నారీ, కాననమున రాచసొమ్ము గతముగఁ గొనుచున్. 126

వ. అదియట్లుండె నింక నొక్క విన్నపం బవధరింపుము. 127

సీ. వేఁట వోయెడువారలు విప్రుమాట, కలుగుదురు పాడప్రువ్వనకలిగినట్లు
విన్నవింపక నాలుక మిన్నకుండ, దేచినీమేలుగోరెడు హితుఁడఁ గాన. 128

క. పాయసముం గలలోభూ, నాయక భోజనము సేయునరులకునెంతే
శ్రేయస్కరమని స్వప్నా, ధ్యాయంబునఁ జెప్ప విందుఁ దజ్ఞుల చేతన్. 129

గీ. భోజనము సేయుమనఁగఁ దాంబూలగంధ,పుష్పములు గొమ్మనఁగఁ ద్రోసిపోవఁ జనదు
ఇంపుతోడుత నంగీకరింపవలయుఁ, గార్యఫలసిద్ధి కవియాదికారణములు. 130

క. ఇలు వెడలి మానవుఁడు తన, తలఁచినతావునకుఁ జేరుఁ దాఁకను నేయం
కిలిలేక యొక్కతీరుపు, వలయును శాకునికవరుల వచనవిశేషమునన్. 131

సీ. హర్మ్యంబువెడల వాయసము చేరువఁ దీర్చ వృషభం బెదుర అంకెవేసి నిలిచె
వాడలో శునకంబు వచ్చెను దక్షిణంబుదపూర్ణకుంభంబు లెదురు పడియె
గవని వెలుపల బెరికయుఁబోతు వలగొనె వలయెక్కసూపెఁ జేవలఁతిఁ జెమరు
పరువునేలను వచ్చెఁబాల [1]పయ్యెరవంక కుడినుండి యొడమకు నడిచెనక్క
తే. నీవువేఁటకు విచ్చేయు నెడ నృపాల, పంబి పెండ్లికి నగుశకునంబులయ్యె
నేఁడు గొల్లలమాట మన్నించి నిలిచి, మృగయకరుగుట మిక్కిలిమేలు తోఁపు.

క. నావిష్ణుః పృథివీపతి, నావిష్ణుం డనఁగ నీవ నరవరదైవం
బీవారగింపకుండిన, నీవల్లవులకు శుభంబు లేలాకలుగున్. 133

వ. వీరలం గృతార్థులం జేయం గృపగల దేని యారగింపవలయు నది యన్నిదినంబులం
గోలెఁ గన్నయదిలేదు దండుగదర్శనంబులు గొనందలంపయ్యెనేని ముందఱఁ జాగి
విచ్చేయు మనిన గొల్లలుల్లంబునం దల్లడిల్లి యీ బ్రాహ్మణుండు పలికినది
యథార్థంబు మా యర్థప్రాణంబులు నీసొమ్ము వలసి నట్లు చేసికొమ్మనినమాండవ్యు
ద్రిమ్మరిమాటలకు [2]దిగులుసొచ్చినగోపాలకుల భూపాలకుండు మృదువచనంబుల

1. పయ్యెద. 2 సొబగువిచ్చిన.

నుపచరించి సైన్యంబు సముచితక్రమంబున విడియించి కనకకుంభ కలితంబై కనుపట్టు గొల్లెనలం గృతావాసుండై. 134

సీ. పెనుపారు కడియంపుఁ బిండివంటలతోడఁ గమ్మనిసద్యోఘృతమ్ముతోడఁ
గనరువోకుండఁ గాచిన యానవాలతోఁ గడిసేయవచ్చు మీఁగడలతోడఁ
బెక్కులాగులఁ గదంబించు జున్నులతోడఁ జేరి దాఁకొన్నక్రొంబెరుఁగుతోడఁ
బిడిచినఁ జమురు గాఱెడు మాంసములతోడఁ దేటతియ్యని జుంటితేనెతోడఁ

తే. బాయసాహారములతోడ [1] వేయులాసఁగ, నఖిలసేనాప్రజలతోడ నారగించి
సంతసంబంది పటకుటీరాంతరమున, జనవిభుండు భజించె నిశాసుఖంబు. 135

శా. కౌండిన్యాన్వయసింధుచంద్ర [2] వినుతక్ష్మాపాలకామాత్యవే
దండానీకమృగేంద్ర చంద్రవదనాతారుణ్య కందర్ప శ్రీ
ఖండక్షోదవిపాండునిర్మలయశోగంగాజలక్షాళితా
జాండాఘోరకలంక శంకరనివాసాహార్యధైర్యోన్నతా. 136

క. సురసురభి కల్పభూరుహ, తరణిజశిబిఖచరదేవతామణిరజనీ
కరకాలబలాహకసఖ, కరపద్మ సమస్త విబుధకవినుతసద్మా. 137

మా. జనహిత సుచరిత్రా సజ్జనాబ్జాత మిత్రా, జనితనృపపవిత్రా సత్కవిస్తోత్రపాత్రా
వనరుహదళనేత్రావంశమాకంపచైత్రా, యనుపమశుభగాత్రాయన్నమాంబాకళత్రా.

గద్య. ఇది శ్రీభారతీతీర్థగురుశ్రీచరణకరుణాలబ్ధసిద్ధసారస్వతపవిత్ర గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శాకుంతలశృంగారకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ రస్తు.

# శకుంతలాపరిణయము

## ద్వితీయాశ్వాసము.

---


సదన సదారాధిత
వాసుకికేయూర వంశవర్ధన వినయా
వాసపయోజాసనక
న్యాసఖకీర్తిప్రసన్న నాగయవెన్నా! 1

వ. ఇత్తెఱంగున దుష్యంతమహీకాంతుండు సంతోషంబున ఘోషంబున నారాత్రి
నిలిచి మఱునాఁడు సూర్యోదయం బగుటయుఁ గల్యకరణీయంబులుం దీర్చి లా
వరుల నేర్చి కదలి. 2

చ. మెకములఁ బట్టఁ గట్టి వలమీటి చనం జననీక యాఁగి [1]తెం
కికిఁ జనఁజేయ బోనునకుఁ గిర్కొలుపం బయి వచ్చె నేని ద
ప్పక పొడువంగ నేర్పు ఘనబాహుబలంబును గల్గి [2]నేటువేఁ
టకు నెఱనాదు లైన సుభటప్రకరంబులు మోహ్రిల నేగఁగన్. 3

క. ముదమును మదమును మనమున, గుదిగొన గోష్ఠంబుఁ గడచి కొండొకచని య
ల్లదె యిదె కాంతారం బన, నెదురం జూపట్టుదాఁక నేఁగఁగ నచటన్. 4

సీ. ఛాయామృగంబుల వ్రేయ గర్జిల్లఁ బ్రచండమై పొడము భేరుండరవము
భేరుండ నినదకంపితములై పాఱెడు శరభసంతతి సాధ్వసస్వనంబు
శరభనినాదవిత్రస్తంబులై గమనించు కంఠీరవనిక్వణంబుఁ
గంఠీరవారవస్ఖలితంబులై చను భీతవన్యకరీంద్రబృంహితంబు
తే. మక్కడింపఁ దదీయకల్మాషభీష, ణోగ్రఘోషంబునను సత్వయూథవివిధ
సత్వరధ్వానములు బహుజాతపక్షి, కలకలంబులు వినవచ్చెఁ గర్ణములకు. 5

క. ఆరావములఁ గృతాంతా, కారము లై వేఁటకుక్క కదుపులు సెలుచం
దారకులు పట్టి తిగువం, గా రయమున మృగయులకు [3]మొగంబుల కెగయన్. 6

గీ. సంతసం బందు నృపతియాస్యంబుఁ జూచి; తిమురుకుక్కల బెడిదంపుఁ దెంపుఁ జూచి
మృగయువర్గంబుగర్వంపుఁ బొగరుఁ జూచి, యుల్లమునఁ జాలమాండవ్యుఁ [4]డులుకుపుట్టి.

వ. వనంబుఁ జేరవచ్చితిమి, మృగంబులు గాన వచ్చుచున్నయవి, యీవచ్చినవారిలోన
నెవ్వరిని విచారించినం గాతరత్వంబు లేదు పోతరంబు బహుళం బైయున్నది. ఏను

---

1 డెంకికి. 2 నేఁటి. 3 మృగంబుల. 4 పలుగు.

[1]బేదబ్రాహ్మణుండ నిర్వనమృగంబుల నవలోకించిన శరభస్వామి తలంపునంబడి
పుట్టినశరభంబులును వైకుంఠకంఠీరవంబు మీఁది యుత్కంఠ నావిర్భవించి నసిం
గంబులును జాంబవంతుం డల్ల పనిసేయునప్పు డుప్పతిల్లిన భల్లూకంబులు నాగ్ర
హంబున వ్యాఘ్రరక్షోభర్త లాక్షారుణాక్షుంబుల నధిక్షేపించి చేయునిక్షుచాపవ్యా
పారంబున నుదయించిన పులులును గుంభిదానవునకు సంభవం బైన యిభంబులును
గృతాంతునిలాయంబులులాయంబు సంతతిం బ్రబలినకారెనుపోతులును సుహా
వరాహంబుపై మోహంబున సమూహంబైన పందులును గాని యేతన్మాత్రంబులు
గావు నాసం బోవుటబుద్ధి గాదు కాదని మగుడ నుద్యోగించిన మందకును దూరం
బుగా వచ్చితిమి [2]నడగఁడు నడతెగ మానిసి మట్టిచిట్టాడని యీచిట్టడవి నెట్లు
చననేర్తు నొకయుపాయాంతరంబున దోడు[3]వెట్టించుకొనియెదంగాక యని యల్ల
నల్లన భూవల్లభుం జేరం జని యిట్లనియె. 8

సీ. కర్మకాండం బెఱుంగని పామరుండుఁ గార్యాదిఁ జేకొని వినాయకుని గొల్చు
వేఁటపైఁ దమి విఘ్నవిభుఁ బ్రార్థనము సేయకయ వచ్చినారము గమనవేళ
శరభశార్దూలాది చండసత్వంబుల మర్దించుకొఱకునై మనదురాక
మృగములు మనచేతఁ దగులువడంగ నంచుల భీతి ప్రజలకుఁ గలుగకుండ
తే. గజముఖుని నేను బ్రార్థింతు వ్రజములోనఁ, బాలకును నేతి కుండ్రాలప్రాలకచటి
గొల్లలకుఁ జెప్ప నన్నుఁదోడ్కొని చనంగ, నంగజాలల ననుపు ధరాధినాథ. 9

క. సేమంబు పూని మృగజయ, కామన సంకల్పపూర్వకముగా జపముల్
హోమముఁ జేయుచు నుండెద, సామజవదనునకుఁ దత్ప్రసాదము కలిమిన్. 10

సీ. చిక్కఁజీరుగఁ గూల్చు సింహపోతకములఁ బోలి తొప్పఱలాడు క్రోలుపులుల
విలయంబు నొందించు విపినంబుపందుల వెరఁజి వెంపఱలాడు హరిణములను
విఱువుకంఠాస్థుల నుఱికి చివ్వంగుల మొత్తిమోదరలాడు మత్తకరులఁ
గూల్పు మర్వరఁ [4]దన్నికొన మన్నుఁబోతుల వ్రచ్చిసందఱలాడు వాహరిపులఁ
తే. జంపివసియాడు శశములగుంపు కుఱికి, చించి చెండాడు కణుజులఁ జేతికోలఁది
వెదకి వేఁటాడు దుప్పుల మెదలనీక, చండవిక్రమచాప దుష్యంతభూప. 11

క. అనుటయు మాండవ్యునిమన, మునఁగలిగిన భీతిఁ దెలిసి భూపాలుఁడి
ట్లను బ్రాహ్మణమిత్త్రునిఁ బా, ఱుని నేనిన్నకట యేమఱుదునే యెచటన్. 12

వ. నీవు వావెంట నంటుకొని యొంటిపడక తోడునీడయుం బోలె నేతెమ్ము ప్రమాదంబు
గాకుండఁ బ్రమోదంబుగా వేఁటవేడుకచూపి కుసుమంబునుం బోలెఁ [5]గందకుండ

1 వేద. 2 నడవయు నెడతెగ. 3 చనియెదంగాక. 4 తన్నుకొన. 5 గసుగంద

నిన్నుం దెచ్చెదనని భుజంబప్పళించి మృగయువర్గంబునుం దానును నిరర్గళ ప్రచారం
బుల డాయనేఁగి [1]ప్రోఁగువారించి దాపుల మేపుల జువ్వుల మొవ్వుల రేఁగుల గోఁగుల
రేలల జాలల నొద్దుల మద్దుల గురుగుల విరుగుల సెమ్ముల జమ్ముల నేరేళ్ల మారేళ్లఁ
గలువుల బలువులఁ గొడిసెల నొడిసెల నందుగుల నిందుగులఁ గలుగొట్లఁ గొట్లఁ
బంచ్చారుల నారులఁ బ్రేంకణంబుల గణంబులఁ గొండమావిళ్ల వావిళ్ల తాండ్లమాండ్ల
జంద్రుల సుంద్రుల వెలఁగల మొలగల బీరల గారల వేములఁ బ్రేముల మఱియును
బెదబిచ్చు పినబిచ్చు సల్లింద సెల్లింద యిప్ప కప్పు మద్ది గద్ద గోరు గోరంట వెలమ
యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగాఁ బెక్కుతెఱంగుల మ్రాఁకులు మూఁకలు గొని
యిసుము జల్లించిచల్లిన రాలనిదట్టంబునం బొడకట్టులేక పరిక్రీడమాన క్రోడసింహ
సైరిభశరభశార్దూలచమరురురుకురంగాది జంతుఘోషంబులును గంకకలవింక కడిం
జర ఖంజరీట కపోతశిఖావళ శుకపికానేకపక్షికులకలకలంబులను ఝుంఝూపవన
ఝంపాసంపాతకంపమాన కల్పాంతకాలజలధి ననుకరించు నరణ్యంబుఁ బ్రవేశించి
వలయువంకలం గాలువలలు [2]నుసులు బోనులు దీమంబులుం జిగురుంగండెలువెట్టి
వేయించి సారమేయంబుల విడిపించిన. 13

సీ. గళనాళములఁ ద్రుంచెఁ గారుపోతులఁ గొన్ని తోలాడెఁ గొన్ని శార్దూలములను
ఎలుఁగులఁ గొన్ని మేనుల నఖంబుల వ్రచ్చె జమరీమృగంబులఁ జంపెఁ గొన్ని
కొఱప్రాణములఁ జేసి కూల్చె దుప్పులఁ గొన్ని చెండె మన్నులఁ గొన్ని గుండెలవియఁ
గఱచెఁ బందులఁ గొన్ని కంధరాంతరములు కొండగొఱియల మన్నిగొనియెఁ గొన్ని
తే. చటులగతిఁ గొన్ని కణుజులసంహరించె, వెంటఁబడి కొన్ని శశముల విత్తు[3]మాల్చెఁ
గొన్ని జింకలపేరివులు గ్రుచ్చివైచెఁ, గుక్కలాటవికంబులు నుక్కుమిగిలి. 14

సీ. కడిమిమైఁ బిడియానఁ బొడిచి యొక్కఁడు కొఱప్రాణంబుతోఁ బులిఁబట్టి తెచ్చెఁ
భల్లాన నిర్గతప్రాణంబుగావించి లావున నొకఁడేకలంబుఁ దెచ్చె
నసిధార మెడద్రెవ్వ నడిచి కొమ్ములతోన నొకఁడు కార్పోతుమస్తకముఁ దెచ్చె
[4]బాణాభిహతిఁ గూలఁబడవేసి యొకఁడు కాననదంతితొండంబు నఱకి తెచ్చెఁ
తే. గుఱుచకుంతాన బెనుమోర గ్రుచ్చి యెత్తి, యెలుఁగు నొక్కఁడు కాల్వట్టి యీడ్చి తెచ్చె
శేపమైఁ జిల్లకోలనాటించి యొక్కఁ, [5]డెద్దుఁ గొనివచ్చెఁ గరిపురాధీశుకడకు. 15

చ. అవి గనుఁగొంచు నెంతయుఁ బ్రహర్షము నొందుచుఁ దానులీలఁగా
నవిరళశక్తిఁ గాంచనసమంచితపుంఖశిలీముఖంబులం

---

1 పోఁగు. 2 తెరలు. 3 మాన్చె. 4 బాణనిహతి. 5 జేఁదు.

గవయవరాహదంతి రురుకాసరపఙ్క్తులఁ గూలనేయుచుం
గవిసి తదీయకంధరములు ఖడ్గముఖంబునఁ ద్రెవ్వనేయుచున్. 16

క. వనచరులనుజూచుచు నటఁ, జన జనపతి కాంచె నొక్కచక్కనియిఱ్ఱి
న్మునిపతిపెంపుడుబుఱ్ఱిని, వనమునఁ జరియించువేళ వలపులకుఱ్ఱిన్. 17

క. హరిణము నెఱిఁగని పుంఖిత, శరుఁడై వెంబడిన యరిగె జనపతి కడిమి
న్వరఋష్యమృగము వెంబడి, సరిగెడు సాక్షాత్పినాకహస్తుఁడు వోలెన్. 18

చ. విలుఁగొని వెంటవెంటఁ బృథివీపతిరా శరపాతభీతిఁదా
మలఁగి మలంగి కన్గొనుచు మార్గము క్రేవకు నడ్డగించుచు
న్నిలుచుచుఁ గొంతకొంత గమనించుచు నర్ధము మేసి మేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచున్. 19

సీ. శాలాంతరంబు మోసంబైన విడివడి యరుదెంచు గాడ్పువాహనమృగంబొ
శశముతో నొంటక జగతిపై వచ్చిన చంద్రునిలోనిలాంఛనమృగంబొ
వీరభద్రుని కృపావీక్షణంబునఁ బునర్నవమై చరించుజన్నపుమృగంబొ
పార్వతీకన్యక [1] ప్రార్థింపవిడిచిన యురగేంద్రకంకణుకరమృగంబొ
తే. యనఁగ మాయామృగమువోలె నామృగంబు, ధరణిపతిబాణనిహతికిఁ దగులువడక
నదులు నగములు ఘనకాననములు గడచి, చటులగతి నేగె మాలినీతటమునకును.

క. ఏతెరువున నరిగె మృగం, బాతెరువున నదులు వనము లద్రులనక ధా
త్రీతలపతి సైన్యసమా, న్వీతుండై యరిగె మాలినీనదిచాఁకన్. 21

గీ. అచటమృగమును బోలేక యలసినిలిచె, నానెలవు నాశ్రమాంతిక మగుటఁజేసి
స్థలవిశేషం బదెట్టిదో ధరణిపతికి, హరిణపతిమీఁద నెంతయుఁ గరుణపుట్టె. 22

వ. ఇత్తెఱంగునం గురంగంబుమీఁదఁ గురంగాంకమౌళీనుండు కృపాతరంగితాంతరం
గుండై యేయకయుండం దత్తరంగిణీతటంబున. 23

సీ. కడఁగిసంక్రీడించు నడవియేనుంగుల గండస్థలుల దానగంధములను
జెంచులరాచకెంజిగురాకుఁబోఁడుల శిరసుల జవ్వాదిపరిమళముల
విచ్చినసెత్తమ్మివిరులఁ దుమ్మెదలాడఁ జాటినపూఁదేనె సౌరభములఁ
గూలద్రుమంబుల గాలితాఁకునరాలి వచ్చినయలరు క్రొవ్వాసనలను
తే. శబలితంబగునయ్యేటిసలిలకణము, లల్లనల్లనఁ గొనుచు మందానిలుండు
చల్లఁగావీచి వనపథశ్రాంతిఁ దీర్చ, నది గనుంగొనువేడుకఁ గదలికదలి. 24

---

1 ప్రార్థించి.

మ. ఒకచో మత్తమరాళనృత్తనినదం బొండొక్కచోఁ జక్రవా
కకుటుంబస్మరకేలిజాతకలనిక్వాణంబు వేఱొక్కచో
వికచాంభోజమరందసన్మధుమదావేశభ్రమద్భృంగగా
నకలాపధ్వని మానసంబునకు నానందంబు సంధింపఁగన్. 25

క. కంజకుముదోత్పలచ్యుత, కింజల్కపరాగపటలకీలిత మగుచు
న్మంజుసరోవరదేవత, మాంజిష్ఠముగట్టుకొనిన మాడ్కిందనరున్. 26

మ. చలదిందీవరచారునేత్ర సముదంచచ్చంచరీకాలకం
జలజాతాననఁ గంబుకంఠి బిసహస్తం జక్రవాకస్తనిం
బులినశ్రోణి మరాళరాజగమన న్భూజాని గాంచె న్నట
జ్జలకల్లోలపరంపరానినదవాచాశాలిని న్నాలినిన్. 27

వ. కాంచి వితతపరిశ్రాంతుండును సంతోషితస్వాంతుండును నై బెదరి బెదరి తన
వదనంబుఁ గనుంగొనుచుం గదలకున్నయిఱ్ఱిగున్న వీక్షించుచున్న యవసరంబున.

సీ. దీర్ఘదీర్ఘంబు లై తిరిగట్టి మడమలు గడచి తూలాడుకెంజడలతోడ
వింజామరము విచ్చి వ్రేలపైచినమాడ్కి డాలొందు నరపగడ్డంబుతోడ
ఫాలబాహూదరపార్శ్వదేశంబులఁ గొమరారు భూతిపుండ్రములతోడఁ
బోశంబు విడిచి కప్పుకొనివచ్చిన క్రొత్తమణుఁగుఁజమూరుచర్మంబుతోడఁ
తే. బ్రహ్మతేజోధికులరైన బ్రహ్మచారు, లిద్ద ఱిరుపంక నలమి రా నెలమితోడ
నగ్నిశిఖవోలి యును జల్లనైనకాంతి, యడర నొకవృద్ధముని వచ్చె నధిపుకడకు.

వ. వచ్చి వెడవెడ దీవించి కృతాంజలి యైయున్న రాజునుం గూర్చుండుమనక తాను
నాసీనుఁడుం గాక నిలిచి హరిణంబు నంగుళిముఖంబునం జూపి. 30

క. ఆశ్రమసారంగం బిది, యాశ్రితమందార దీని నలయించితి నీ
విశ్రామమునకు నిది మా, కశ్రాంతముఁ బ్రాణమిత్రమై చరియించున్. 31

ఉ. ఏమనిచెప్ప నప్పు డటులీనినమైఁ దడియాఱలేదు దా
నీమహితాశ్రమంబునకు నేసరవిం బడితప్పి వచ్చెనో
ప్రేమముఁ జేసి యంగుళులఁ బెట్టినదర్భలు మేయుచుండఁగా
నోమనఁ బాపగోలెఁ గృప నోమితి నీమృగరాజడింభమున్. 32

క. తనతల్లులు మునిపత్నులు, తనతండ్రులు మునిజనములు తనసహజన్మల్
మునికన్యలుగా గారవ, మునఁ బెరిఁగి వనౌకసులకు ముద్దులు గురియున్. 33

క. అనసూయ ప్రియంవదతోఁ, దనమీాచందమున నిన్న మాపటఁగోలె
న్వనితకు శీతలకృత్యము, లొనరించుచునున్నవార ముడుగని పనిగాన్. 43

గీ. నయ మొకించుకయైనఁ గానంగఁబడదు, చలువమందుల శైత్యంబు సంభవిలక
నినుఁడు గుడిచిన నీరయ్యె నింతి మేన, నంతకంతకు సంతాప మగ్గలించె. 44

క. వెఱదికి మన మొనరించెడు, చలువలు రవి మేన నైన శైత్యమునొందుం
బలుసలు వేయును నేటికి, వలిగొని వడఁకాడుచుండు వైశ్వానరుఁడున్. 45

ఉ. వేసర కాచరించెదము వేయుఁ[1] దెఱంగుల శైత్యకృత్యము
ల్వేసవి పశ్చిమానిలము వేఁడిమికన్నను [2]వాఁడి గల్గి తో
డ్తో సముదీర్ణమై యగరు ధూపము పెట్టినఁ దావు[3]లుబ్బ ని
శ్వాససమీరణంబు వడచల్లఁదొడంగఁ గడంగి పైపయిన్. 46

క. చదువుల వినియుండుదు మీా, యదవద విరహప్రకార మని యాపనికి
న్సదతి కలలోన నెఱుఁగదు, కదిసెన్నఁడు వినదు తొల్లికథలం దైనన్. 47

వ. ఇది యేమిమాయయో కదా తాత కాశ్యపమునీంద్రుఁడునుం జేరువ లేఁడు,మనమీా పూఁబోఁడియున్న పోఁడిమియు నగ్గలతవేఁడిమియు నేయుపాయంబులం జక్కఁ జేయుద మెవ్వరికిం జెప్పుద మెక్కడం జొచ్చువార మేదైవంబుం బ్రార్థింత మని యనసూయ కన్నీరునించిన బ్రియంవద యిట్లనియె. 48

చ. ఎఱుఁగుదుఁ గొంతకొంత యదియే నెఱిఁగుండియుఁ జెప్ప నేల యం
చెఱుఁగనిదాని బోలెఁ జరియింపుదు నిట్టిరహఃప్రయోజనం
బుఱక తమంతఁ జెప్పుట యయుక్తము నేఁ గనుఁగొన్న చిహ్నము
ల్వేఱక చెప్పెద న్గినుకలేక శకుంతల సమ్మతించినన్. 49

క. అన బొమముడియుం బెట్టుచుఁ, గను [4]గీఁటిన ననుమతంబు గైకొనినదియై
యనసూయ చెప్పుమనుచును, దను నడుగఁగ నాప్రియంవద గభీరోక్తిన్. 50

శా. నీవు న్నేనును జూడఁగా వనములో నిన్న న్మదాలివ్యథన్
దావ ర్తింపఁగ వచ్చె రా జెఱుఁగవా తద్వేళఁ బాలిండ్లపైఁ
బ్రోవుల్వోసినభంగి ముత్పులకము ల్పుంఖానుపుంఖంబుగా
నూవిళ్లూరుచుఁ జూచె భూవిభుని దా నొయ్యారపుం జూపులన్. 51

చ. మనతరళాక్షి సిగ్గుతెరమాటున నుండక దాఁటి దూఁటిపా
టినఁ గదియంగఁ బట్టి యిసిఱింతలచూపులఁ దన్నుఁ జూడఁగా
మనుజవిభుండు ప్రేమగరిమంబునఁ జూచె లతాంగి నయ్యెడన్
జనుమొన నాటె నానృపతిచంద్రుని చూపులుఁ గంతుతూపులున్. 52

1 విధంబుల. 2 వేఁడి. 3 లుబ్బి. 4 గీఁటున.

క. అప్పటఁ గోలెను లలనకు, నిప్పంటినయట్లు మేన నిగిడెడుఁ దాపం
బిప్పగిది నేను గన్నది, తప్పదు నిక్కంబటంచు దాఁపక చెప్పెన్. 53

క. ఆమాటలు విని నృపతికిఁ, గాముని శరనిహతి నైన గంటులు పూడెం
గామాగ్నియుఁ జల్లాఱెను, గామిని తనమీఁది ప్రేమకలిమియుఁ దెలిసెన్. 54

వ. ఇత్తెఱంగునం బ్రియంవద మృదూక్తులం దత్ప్రకారంబు విరహవికారంబకా నిశ్చయించి తన్ముఖంబునం దెలియక ప్రయోజనం బొడవడ నేరదని యనసూయాశకుంతలం డగ్గఱి కుంతలంబులు దువ్వుచు నుడుకుచుం దొరంగు కన్నీరు కపోలంబులరాలినం దుడుచుచు మృదుమధురమందమందస్వరంబున 55

గీ. తలఁపు వంచింపుదురు తల్లిదండ్రులకును, జెలులయెడ దాఁచి నిలుపరు చిత్తవిధము
ఇంతి నీకింక నీకింక యెందుమాను, జెప్పు నాతోడ నాతోడఁ దప్పుగాదు. 56

క. నీకు బహిఃప్రాణములము, మాకె యెఱింగింప వింక మఱి యెవ్వరికిం
గోకనదహస్త చెప్పెదు, దాకొని మదిలోననున్న తగులు న్నెగులున్. 57

ఉ. లాఁతితనంబు చేసి యబలా యెఱిఁగింపక నిల్వనోపుదే
లేఁతలు గాక గుండె లగలించెడు కోయిలదుండగీల పె
న్గూఁతలు గండుఁ దుమ్మెదల గుంపుల మ్రోఁతలు లోన నీఁతలుం
బోఁతలు నైనయట్టి తలపోఁతలుఁ గంతునివీఁకచేఁతలన్. 58

క. రోగంబు పేరెఱుంగక, యేగతి నౌషధము శాంతి కీనొప్పగు నా
లాగున నీహృదయమునను, రాగము కీ లెఱుఁగ కేవెరవు సేయనగున్. 59

వ. ఏనును బ్రియంవదయు నీకుం బర్యాయదేహంబులము ప్రతిచ్ఛాయలము మాకంటె నింక నెవ్వరు వశ్యులు వయస్యలుం గలరు నాయాస్యంబు చంద్రాస్య చక్కంజూడు నీయాశాస్యంబు నెఱిఁగింపకున్న నమ్మొల్లకుండుట ప్రియంవదప్రాణంబులకుఁ దప్పినదానవు నీవు ప్రేమవాటించి పెంచినమాలతీలత స్వహస్తంబునం ద్రుంచినదాన వని యానలు వెట్టిన నిట్టూర్పు నిగిడ్చి మగిడ్చినలోచనంబు లించుకవిచ్చి నెచ్చెలివదనంబుఁ జూచి తదీయాంకపీఠంబున వదనపంకజంబు మోపికొని గద్గదకంఠనాళ యై యుత్కంఠ నీకుం బ్రియంవద చెప్పినది తప్పదని. 60

శా. గంగాగర్భమునందు నేఁటితుదదాఁక న్నాటరాకుండ నుం
డంగాఁ గల్గెను మీమొగంబు లిఁకఁ జూడన్నాకు మోమేది యే
భంగి న్నిల్తు మునీంద్రకన్యకలతోఁ జాటించి మాతండ్రిఁ ద
న్వంగీ యేగతిఁ జేరఁబోదు ననియొయ్య న్వెక్కి వెక్కిడ్చినన్. 61

క. కన్నీరుఁ దుడిచి గొజ్జఁగి, క్రొన్నీరున మోము గడిగి కూరిమి వెలుఁగ
న్నన్నీరజముఖిఁ గౌఁగిటఁ, జెన్నారఁగఁ జేర్చి యెలమి చెన్నుదలిర్పన్. 62

క. కోమలి మేనకకును వి, శ్వామిత్రమునీంద్రునకును జనియించిన బా
లామణివి నీవు నీకే, లా మునికన్యకలతోఁ గలంకము గలుగున్. 63

ఉ. నీకు విచార మేల మహనీయచరిత్రవు నీమనంబు గం
గాకమనీయపావనము కల్మష మందఁగ నేర దెందు మం
దాకిని నిర్ఝరాకృతి నుదారగతిం జనుదెంచుపెల్ల ర
త్నాకరుఁ బొందఁ గాక యహహా చన నేర్చునె చొటకుంటకున్. 64

గీ. చంద్రవంశోద్భవుండు దుష్యంతవిభుఁడు, నీకుఁ బతియౌటకుం దగు నీరజాక్షి
తగుదు వతనికిఁ గౌశికాత్మజవు నీవు, నెట్టి యనుకూలదాంపత్యమిరువురకును. 65

వ. ఆరూఢయౌవని వైననీకుం దగినవల్లభుండు గలుగ సుమావల్లభుని సేవింపం దాత కణ్వమునీంద్రుండు సోమతీర్థంబునకుం బోయి వ్రతంబుపూని వర్తించుచున్నవాఁ డేతత్కార్యంబు సిద్ధించిన నయ్యార్యచరితుం డుల్లసిలుం గాని పుల్లసిలండు చింత యుడిగి సంతసంబు నొందుమనిపల్కి యనసూయ ప్రియంవదవదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె. 66

గీ. లెస్సచోటనె నిలిచె నీలేమప్రేమ, తాత వినినను మిగుల సంప్రీతినొందు
ధరణిపతిచిత్త మేమిచందంబొ యనిన, నింపుమీఱఁ బ్రియంవద యిట్టులనియె.

క. ఆవిధము నించుకించుక, భావంబునఁ దోఁచె నానృపాలుఁడు నిన్నన్
దావనమునకును వచ్చిన, తేపదొలంగినది పల్లటిలినది చెలువున్. 67

ఉ. లేఁకువ దప్పి తప్పి వడదేఱుకన్నులు మున్నునంటి యా
తూఁకువ లేక మేను గడుఁ దూలియ యున్నది మోముచందమున్
ఖేఁకువచంద మామగతి విన్నన యైనది మన్మథాస్త్రము
ల్దాఁకినభంగి దోఁచువసుధాపతిఁ గాంచితి యాగశాలలోన్. 69

వ. మృగయావిహారవ్యాయామంబునం గలయలపు సొలపుం గాదు ప్రసవబాణ[1]తపనవ్యథాజాతసంతాపశ్రాంతియ సిద్ధంబు. ఆమూర్ధాభిషిక్తునకు శుద్ధాంతకాంతా జనచింతాభరంబొ శకుంతలాచింతాభరంబొ నేఁట యోపట నెల్లి యెల్లుంట మెల్ల మెల్లనఁ దెలిసికొనియెద నీలోన నిప్పల్లవాధరి ప్రసవభల్లంబుల నల్లంబు జల్లని యొల్లంబోయి యపాయంబు నొందకుండ నుపాయంబు విచారించుకొనవలయు ననిన నవ్వచనంబులు భూవల్లభుండు విని. 70

1 పతన.

శా. బాలారత్నము కూర్మి నావలన సంపాదించుట ల్వింటిఁ ద
న్మూలం బైన మనోజతాపమును గన్నుల్చల్లఁగాఁ గంటి నీ
వేళన్నేఁ బొడసూపకున్న మరుఁ డేవిఘ్నంబు గావించునో
యాలస్యా దమృతం విష మ్మనెడు వాక్యంబు ల్శ్రుతం బెప్పుడున్. 71
క. ఒప్పనిపని కాలస్యము, చెప్పదు రింతియు శుభస్య శీఘ్రం బనఁగా
నిప్పలుకు విచారించిన, నిప్పుడ పొడ చూపవలయు నిభగామినికిన్. 72
వ. ఒక్క యుపాయాంతరంబునం గానుపించెదం గాక యని యొక్కయెలమావికి ఛ
ద్మంబున బిసతంతువాగురం బాగుగానమర్చి యురివేఁటకాని లాగున శకుంతంబుల
నిరీక్షించుచున్నవాఁడ పోలె శకుంతల యున్న వృక్షవాటి కల్లనల్లన చొచ్చివచ్చుట
యు ననసూయాప్రియంవదలు కనుంగొని రాజు విచ్చేసె నని సంభ్రమంబున నా
సనంబుల డిగ్గినం జూచి సమ్మదభయవినయకలితలజ్జాసముపేయం బగురయంబున.
చ. కిసలయశయ్య డిగ్గి యొకక్రేవ శకుంతల నిల్చియుండఁ ద
త్కుసుమనవాంక మంటుకొని క్రొత్తవిరుల్గనుసట్టె నెంతయు
న్మసలిసిడంబు వాని పువుముల్కలు నాటిన పోటుగంట్లనన్
రసగిరిపేరఁ బడ్డరుధిరంబుల యోడికతండమో యనన్. 74
ఉ. ఆరతి బోఁడి సజ్జచిగురాకులు పైపయి నంటియుండఁగాఁ
గీరముఖారుణచ్ఛవిని గెల్చితనర్చినయంగజాతుశృం
గారపుఁదోఁటలోని నవకల్పకవల్లియొ యంచు రాజు నిం
పారఁగఁ జూచుచుండె మధురోల్లసముగ్ధము లైన చూపులన్. 75
క. బాలికఁ జూచుచు ధరణీ, పాలుఁడు పలుకుడిగి ప్రమదభరితుం డయ్యె
న్బాలికయును నాధరణీ, పాలకునెడ లజ్జ మౌనబంధము నొందెన్. 76
వ. ఇవ్విధంబున శకుంతలాసౌందర్యసందర్శనసౌఖ్యపారవశ్యంబున రాజును లజ్జా
భయరజ్జుబంధంబున మానిగంధగజయానయుఁ జిత్రరూపంబు చెలువునఁ బ్రతిజ్ఞ
చేసికొనినకరణిఁ గనుఁబోఁక వెట్టిన చందంబున మూసినముత్తియంబులవలెనుండ నన
సూయ డాయవచ్చి భూనాయకున కిట్లనియె. 77
గీ. నిన్న నిచ్చట నీయింతి నిన్నుఁ జూచి, చూచుటయె తప్పఁగాఁ జూచి సూనబాణుఁ
డింతఁగాఁ జూచె విచ్చేసితింతలోనఁ, గ్రంతగాఁ జూచుఁగాకింకఁ గాంతమరుఁడు.
ఉ. జాతకృపావిభూతి మదసామజయానను దేవయాన మీ
తాత వెడల్చి తెచ్చె భయదం బగుకూపములోన నుండఁగా
భూతలనాథ నీవును బ్రభూతదయ న్వెడలింతుఁ గాక నేఁ
డ్డీతరళాయతాక్షిని రతీశుఁడు ద్రోచినతాపకూపమున్. 79

చ. అనిలము రోగముం గలవు నగ్నియుఁ దోయము దైవికంబులై
వనుఁ వనవారుఁ జోరులును శాత్రవులుం బయివారుఁ జేయు పీ
డనములు మానుషంబు లగుటం బతినంపని యీద్వివర్గము
న్మనమునఁ గాంచి నేర్పు మయి మాన్పుటయొప్పుఁ బ్రజాభివృద్ధికిన్. 80

వ. ఈయర్థంబున మారుండు చోరుండు మామానిని మానధనంబు ముచ్చిలి తెచ్చి మీకిచ్చిన చోరుండు భవత్సమీపంబునన యున్నవాఁడు స్త్రీధనంబులు రాజుల కగ్రాహ్యంబు లింతిసొమ్ము మగుడ నిప్పించి యశస్కరుండవై మదనతస్కరుని శిక్షించి విచ్చేయు మనిన మందస్మితవదనారవిందుం డై యయ్యిందువంశసంభవుండు విస్రంభగంభీరంబుగా నిట్లనియె. 81

గీ. మొదల మాధైర్యధనములు ముచ్చిలించి, యించువిలుకాఁడుదొంగ మీయింతికిచ్చె
నేముకో వెలపులుఁగుచే నెలుఁగుటయును, గుదువ మాకిచ్చె మీయింతిహృదయధనము.

క. మాసొమ్ము మాకు నొసఁగిన, మీసొమ్ము స్త్రీకు మగుడ మీమాసొమ్ము
ల్వాసివడకుండ నూరకఁ, గోసనయేమిటికి మార్చుకొనియెద మొండెన్. 83

గీ. ఇందులో నిష్టమెద్ది మీయిందుముఖికి, నడుగుఁ డెడమాటలకుఁ బ్రొద్దు నిడివిలేదు
సాయమవసానమైనను సవనరక్ష, కొదగవలెఁ గాని యింకెట నుండరాదు. 84

మ. నయశాస్త్రంబులు మీరెఱుంగనివి యెన్నంగల్గ వింతుల్మనః
ప్రియవీక్షింపఁగ దాస్వయంవరము కల్పింపంబడె స్త్రీకుమా
కు యశోహానులులేవు కౌతుకము మీకున్గన్క నింగల్గె నే
నియుఁగావింపుఁడు మాకుఁ గోర్కులు మదిన్నిండార గాంధర్వమున్. 85

వ. వివాహంబులు బ్రాహ్మ్యంబును దైవికంబును గారుడంబును బ్రాజాపత్యంబును రాక్షసంబును నాసురంబును గాంధర్వంబును బైశాచికంబును నను నెనిమిది తెఱంగులం బ్రవర్తిల్లునందు క్షత్రియులకు గాంధర్వంబును రాక్షసంబును ముఖ్యంబులనిన నృపముఖ్యుని వాక్యంబులు శకుంతలవయస్యలువిని వినయంబున నిట్లనిరి. 86

చ. జనవర నీవుచెప్పినది సత్యము నీమది దుష్పథంబునం
జనమియు నేమెఱుంగుదుము సర్వవిధిజ్ఞుఁడు కాశ్యపర్షియు
న్మనముననొందుహర్షము నమర్షమునొందఁడు మాకునీప్రయో
జనముశుభంబె యైననొక సంశయమున్నది మానసంబులన్. 87

వ. అదియెట్టిదనిన. 88

క. వేఁటమయివచ్చి నృపమా, బోఁటికిఁజిట్టంట్లనంటి పోయినపిదపం
దాఁటువడుం గులమునకును, మాటయుఁ గల్గునకువచ్చు మానులచేతన్. 89

ఉ. మాతరలాక్షిపైఁ గలుగుమక్కువ నిక్కువ మయ్యెనేని యో
భూతలనాథ యీతలిరుఁబోఁడికి నీవనుఁ బుట్టుపుత్త్రుఁ బ్ర
స్ఫీతిగ యౌవరాజ్యపదపీఠమునన్నిలుపంగ సత్కృపా
న్వితుఁడవై మనోజ్ఞమహనీయముగా శపథంబు నీఁదగున్. 90

క. అనవుడు నవ్వనితలతో, జనపతి యీపనికి నేలసందేహము నా
ఘనలక్ష్మికిఁ గాశ్యపముని, మనుమని కంటెను మఱొకఁడు మాన్యుఁడుగలఁడే. 91

సీ. నిజముగా నీబోఁటి నెలఁతపైఁ గూరిమిగలుగు నా యంతరంగంబుసాక్షి
కలహంస కీరకోకిలములుఁగొలువ నోలగమున్న యీవనలక్ష్మిసాక్షి
సుధరకన్యానాథ కోటీరరత్నంబు చంద్రుండు మాకులస్వామిసాక్షి
యలికలోచనమూర్తియైన కాశ్యపమహామౌనీంద్రు పాదపద్మములుసాక్షి
తే. సారసత్యచరిత్రలు మీరుసాక్షి, యీలతాంగికిసుతుఁ డుదయించుపుణ్య
మేనుజేసిననతని నాయేలుసకల, సింధునేమికి యువరాజుఁ జేయువాఁడ. 92

వ. అని యివ్విధంబున నవ్విశ్వంభరాభర్త విశ్వాసంబుచేసిన విశ్వామిత్రపుత్త్రిం దెచ్చి గాంధర్వం బమంత్రకంబు గావున నారాజు హస్తంబునకు నారాజవదన కరసరోజం బిచ్చి శచియు శతమన్యుండు శరధికన్యయు శార్ఙ్గపాణియు శైలరాజకన్యయు శశాంకశేఖరుండునుంబోలె శశివదన శకుంతలయు శశికులావతంసంబు దుష్యంతుండును ననుకూలదాంపత్యసౌఖ్యంబు లవిచ్ఛిన్నప్రీతి ననుభవింపుదురుగాక యని యనసూయాప్రియంవదలు దీవించి వాసనాప్రసవముకుళంబుల నిరువురిశిరంబులం జల్లి పల్లవతల్పంబునకుఁ గొనిపోవు నెడ. 93

సీ. ప్రళయసంధ్యానటత్ఫాలాక్షుడమరు[1]ప్రోచ్చండనిర్ఘోషంబు బెండుపఱచి
మందరాచలమహామథనవేళాగుంభదంభోనినాదంబు నపహసించి
గిరిగరుత్ఖండనక్రీడాసమారంభదంభోళిరుదితంబుఁ ద్రస్తరించి
పుష్కలావర్తకాంభోధరోదరగళన్నిర్ఘాతరావంబు నీచపెట్టి
తే. పరుస దిక్కుంజములఁ బ్రతిధ్వనులు చెలఁగ, నాశ్రమారణ్యముల నెల్ల నాక్రమించె
మునులు భీతిల్లఁ గాళికాముఖమహోగ్ర, భూరిసన్నాహసమరభేరీరవంబు. 94

స్రగ్ధర. ఆనిర్ఘోషంబుకంటెన్ [2]హారదురుగతి మున్నాడి యొక్కింత నార్తి
ధ్వానంబుల్మౌనిరాజీవదనభవములై వచ్చె నస్మత్తపోర
క్షానిష్ఠాలోలహేలాసమరవిజయదుష్యంతభూపాల రక్షః
కీనాశుల్వచ్చి రద్యత్క్రియఁ దపసుంరక్షింపు రక్షింపుమంచున్. 95

1 గూ. 2 హరి.

గీ. పిశితభోక్తల నిష్ఠురభేరిరవము, నధికభీతమునీంద్రుల యార్తరవము
గోపకారణ్యరసములు గుదిగొనంగ, నపరరావంబు భూవిభుఁ డాదరించి. 96

సీ. సౌధాగ్రరత్నపంజరముల రంజిల్లు రాజకీరమనోజ్ఞరవము కంటె
భోగినీనఖరాగ్రముల మోహనంబైన నలమానవీణారవంబు కంటెఁ
గలకంఠకంఠులు కలరవంబులఁ గొల్పు రమణీయసంగీతరవము కంటెఁ
జామరగ్రాహిణీజనముల కరరత్నవలయమంజీరరావంబు కంటె

తే. మందిరోద్యానకాసారమధుపచక్ర, వాకకలహంస మధురరవంబు కంటె
నుత్తమక్షత్రకులజులు చిత్తగించి, యాదరింతురు కరుణతో నార్తరవము. 97

వ. ఇత్తెఱంగునఁ గురంగాంకకులమహీభర్త మహర్షుల యార్తరవంబు విని ముహూర్త
మాత్రంబునం దడయక తదీయరక్షార్థంబు రక్షోవరులపై నడువసమకట్టి శకుంతల
వదనం బవలోకించునప్పుడు. 98

ఉ. తాఁగదలంగ బాష్పములధారలునుం గదలంగ నింతి దా
నాఁగకయున్న దుశ్శకున మానని చెప్పలనప్పళింపఁగాఁ
దోఁగిన యశ్రువారిఁ గనుదోయి[1] భరంబయి యొప్పె సెజ్జఁగాఁ
గ్రాఁగిన సిక్తతోయముగు కాయజుసాయకయుగ్మమో యనన్. 99

క. ఆవేళ శకుంతలతో, నీవేల లతాంగి యింత నెగులు పడంగా
నా వేలము సమయింతును, నీవేలం జిటికెవేసి నిలిచినమాత్రన్. 100

క. నాలావుకొలఁది నెఱుఁగక, బాలా వెఱచెదవు కోణపనికాయముపై
కోలాహలముం జేయుదు, హాలాహలహరుఁడువచ్చి యడ్డంబైనన్. 101

క. అని తేర్చెఁ బ్రియంవదయును, ననసూయయు విభునిఁజేరి యట్టిట్టనరా
కనిరీక్షింపనతని మే, లునకుం దమసఖికి వామలోచన మదరన్. 102

గీ. కాంచి మనములఁ గడుఁగౌతుకంబునొంది, యాశకుంతలతోడి నో యబరుఁబోఁడి
జయమవశ్యంబు నీనిజస్వామికవును, నగుమొగంబున ననును భూనాథుఁజూచి.

ఉ. హస్తినిశాటభంజనుఁడు హైమవతీరమణుండు దేవతా
మస్తకరత్నపుంజరుచిమంజులపాదసరోరుహుండు లో
కస్తవనీయధాముఁడు జగన్నుతుఁ డా త్రిపురాంతకుండు దా
స్వస్తి యొనర్చుఁగాత! విలసత్కరుణామతి దానవాజిలోన్. 104

వ. అని యాశీర్వదించి సమ్మతింప సమ్మహీవరుండు వనబహిరంగణంబునకు సారథియె
దురు తెచ్చిన స్యందనంబెక్కి యొక్కరుండును నుక్కుమిగిలి త్రిపురాసురవీరుల
పయిం జను ఫాలలోచనుండునుంబోలె నాలంబునకు నడచునెడ. 105

---

1 యరుణం.

సీ. జడలూడియవహుళకై పడిఁ జిక్కఁజీరఁగా నవనిపైఁబడి పొరలాడువారు
పదిరైయిదునంజలపరువెత్తి చనలేక దగదొట్టి పెదవులుదడుపువారుఁ
గంపతోఁకుల జీరుగంటులై వీఁపులఁ జీరలంటగఁ బొదల్దూఱువారు
నెటుఁబోవఁగలేక యుటజకోణములలో నొఱిగి యూరుపు పుచ్చ వెఱచువారు
తే. లేఁటిఁబొడఁగని వెసబాతళించువారు, సైనమునులను జూచి హస్తాబ్జమెత్తి
వెఱపుడుగుఁ డోడకుఁడు భ్రమవిడువుఁడనుచు, నంచితాలాపములభీతినపనయించి.

క యాగము గొదవడకుండఁగ, సాగింపుఁడు యుష్మదీయసవనానలకుం
డాగతవినీలధూమస, మాగమమున దనుజమశకమండలి మ్రగ్గున్. 107

క. అని తేర్చి యనిలరయమునఁ, దనయరదము నరుగనిచ్చి దొదవ్వులన
ద్దనుజులఁ గనుఁగొనిరిపుఖం, డనచండభుజుండు విలుగుణధ్వని చేయన్. 108

మ. చెలిమిం[1]జేసెఁ దదాహవస్థలమునం జృంభించియాచంద్రమః
కులభూపాలకబాహుదండవిలసత్కోదండటంకారము
న్గలిశారావగభీరభైరవమహాకోపోగ్ర హుంకారము
ల్ప్రళయారంభనటత్కృతాంతపటహప్రత్యగ్రభాంకారముల్. 109

క. ఆరావము దమకుం గ, ర్ణారుంతుదమైన దానవాధిపుఁ డనిపెన్
భూరమణునిమీఁద దిక్కరి, సారుల మాకందశరభసైన్యాధిపులన్. 110

ఉ. వారును నేగుదెంచి జనవల్లభుపై మిహిరాంశుతీవ్రకిం
శారుపరంపరల్వఱపఁ జంచలమొంద [2]కవజ్రదీప్తిమ
ద్దారుణబాణయుగ్మముల దారితకంఠులఁజేసి వీరల
క్ష్మీరమణీయభూతబలికి న్బలుగొత్తులఁ జేసె నిద్దఱన్. 111

క. మాకందశరభులిద్దఱు, నీకరణిని సమరధరణి నీల్గుటవిని యా
రాకాసిఱేఁడు కుపితయ, మాకారత నగ్నికణము లతులరాలన్. 112

శా. ఏమేమీ మఖరక్షకు న్మనులు ధాత్రీశాధముందెచ్చి సం
గ్రామక్రీడకు నొడ్డిరే మఱచిరో కాకుత్స్థులం గర్జదం
భోమత్కల్పనిశాటవీరసుభటస్ఫూర్జద్భుజాకార్ముక
జ్యాముక్తాతికఠోరసాయకమహాశంబాకిసంబాధమున్. 113

వ. మాకందశరభులిద్దఱు పడ్డనేమితప్పె దర్పకారాతి యేతెంచినఁ జక్రధరుండు విక్ర
మించిన జెచ్చెపడని వియచ్చరకోటి సేన లెచ్చటికిం బోయె నని నిర్నిద్రనిర్ని
రోధక్రోధంబున నసురనాథుండు సుభటయూథంబు నాయోధనంబునకుం బను

---

1 జేసి తదా. 2 కమందదీప్తిమందారిత

ప వారునుంజని యుద్ధృత భేరీభాంకృతులును జటులమదకరిఘటాఘీంకృతులును దురగహేషాహేంకృతులును గుండలితకఠినకోదండజ్యాలతాటంకృతులును బదాతి నదనాదసాహంకారహుంకృతులును నజ్జజాండకటాహంబు చిప్పలసందు వాపం గోపంబు పెక్కురూపంబులుగఁ గొన్న విధంబున నీరంబు బహుశరీరంబు లెత్తి నచాడ్పున మూఁకంగొని వేఁకనిడమి నాకంగొనక వీఁక నొక్కూఁకువం గరిపురాధీశ్వరుండు దాఁకి నల్లగిరులుంగొను నోడళ్లకాంతులు మొయిల్లును, విస్ఫూర్జితాట్టహాసంబులు గర్జారవంబులుగ స్యందనప్రభాపుంజంబులు మెఱుంగులుగా నంపవానలుముంపఁ జలింపక నిలింపపతి సత్వసారుండై యొకవీరుండు విల్లుం దెగఁగొని వాఁింపవెల్లువ పెల్లుగాఁ బఱపినం బసని యాశనిరోచిరుద్భల్లంబు లగు మనుజవల్లభుభల్లంబులం గృతాంతపురపథికు లగురథికులును విశ్లథంబులగురథంబులునువికర్తనతనయకింకరహ్యాత్తులగు వీరరాహుత్తులును విగతత్రాణంబు లగుఖత్తుబాణంబులును విస్తీర్ణజీర్ణాంగఁబులగు మాతంగఁబులును విన్యస్తదైన్యంబైన సైన్యఁబును విస్రస్తంబును, విధ్వస్తంబును వీటతాటంబును వీరాకుల విదళంబునుం గావించి విలోకించిన. 114

చ అఖిలజగద్విహారకులహారపరాయణుఁ డుల్లసచ్ఛిఖా
శిఖిసఖఖడ్గవాణి రవిజిహ్వుఁడు విస్ఫురితారిమండలీ
ముఖులు వీరశేఖరులు ముప్పదికోటులు ముఖ్యనాయకు
ల్సఖులనుబోలె నుండ బలసంపదు పేతుఁ డభీతుఁ డాజులన్. 115

సీ. తురగరింఖాముఖోద్ధూతధూళీపాళి నభ్రగంగానది నడుసు రేఁగ
లసితశస్త్రిజ్యోతు లాశాధినాథుల యిండ్లముందళ్ల నీరెండగాయ
దంతిసంతానదుర్దాంతఘీంకృతులచేఁ జెవులు జుమ్మనుచును జిబ్బువోవ
విపుల సైన్యవధోగ్రవిన్యాసరవమున నుర్వీప ట్టదలి యుఱ్ఱూఁతలూఁగఁ
తే. గుండలీకృతచారుకోదండదీర్ఘ, నిష్ఠురజ్యారవంబుల నింగి వగుల
విక్రమాభిక్రమంబున నాక్రమించి, రభసమునవచ్చి దుష్యంతవిభునిఁ దాఁకె. 116

ఉ. తాఁకి పరేతరాజవరదత్తము లైన మహోగ్రబాణముల్
ప్రేఁకని వీఁకతోడఁ బృథివీపతిపై నిగిడింప నాతఁ డ
క్కూఁకకు నోర్వలేక యలుకం బిశితాశనభర్తవక్షముం
దాఁకఁగ నేసె శాత్రవవిదారణదారుణవారుణాస్త్రమున్. 117

క. వారుణబాణమునకుఁ బ్రతి, కార మెఱుంగక సురారి గతజీవుండై
ధారుణిఁ బడెఁ బవిధారా, దారితమైపడిన గోత్రధరుచందమునన్. 118

వ. రవిజిహ్మఁడు వారుణబాణపాతంబునం బ్రేతపతిపురంబునకుం బోయినం గనలి కాళికాముఖుండు క్రోధపాటలముఖుం డగుటయుఁ బాటలవర్ణ మానాశి మర్త్యాశిత్రయం బగ్నిత్రయంబు ననుకరించి లోకత్రయదాహకులై ప్రచండవేగంబున నేనుంగుపురాధిపు సేన నేన సంహరింతునని పంతంబులాడుచు నారాజసింహంబు పయిఁ గదిసిన 119

శా. సంగ్రామంబున కుత్సహించుటయు నాత్మాధర్త కల్పాంతవే
ళం గ్రీడించులులాయవాహునిలీలం గ్రుద్ధుఁడై యుద్ధసీ
మం గ్రోధాగ్నికిఁ జేసె నాహుతులుగా మానాసిమర్త్యాసిపే
శ్లం గ్రూరాకృతిఁ గ్రాలు దానవుల ఖేలద్బాణయుగ్మంబునన్. 120

గీ. పార్శ్వవలిద్దఱు నభూమ్యాభిపాలు నిశిత, బాణయుగమున నిర్గతప్రాణులైనఁ
దూర్ణముగ వచ్చి పాటలవర్ణుఁ డేసె, నవనిపతిమీఁద నైంద్రజాలాశుగంబు. 121

క. ఆయింద్రజాలబాణము, మాయావిధ మేమిచెప్ప మహనీయంబై
యాయోధనసీమమహి, నాయకుకన్నులకు మునివనంబై తోఁచెన్. 122

మ. కకుబంతంబులుముట్టి మ్రోయుచుఁ బరీక్షావేదఘోషంబుఁ దా
నొకచో నధ్వరతంత్రమంత్రనినదం బొండొక్కచో స్మార్తక
ర్మకలాపారవ మొక్కచో లలితమీమాంసానినాదంబు వే
ఱొకచో యుద్ధవిజృంభణం బుడిగి యయ్యుర్వీశ్వరుం డుండఁగన్. 123

క. ఆరాక్షసమాయాస్థితి, సారథియెఱిఁగింపఁ దెలిసి సారాస్త్రమున
న్వారించియొక్కతూపునఁ, బారుండిల గూలనేసెఁ బాటలవర్ణున్. 124

శా. క్రవ్యాదుం బరిమార్చి యెంతయును నుగ్రంపశ్యుఁడై నిల్చి వా
యవ్యాస్త్రం బరివోసి యేయుటయు వాత్యావేగవిస్ఫూర్తినా
ర్తివ్యాహారము లుప్పతిల్ల నుడుపీథింగొండ్లియాడించెదై
త్యవ్యాధుత్తైరబొమ్మలట్లు నిగుడం దా[1]నాటకాఁడుంబలెన్. 125

స్రగ్ధర. ఆజన్యంబందు నిమ్మై నఖిలదనుజవీరంతి వీరోగ్రసారు
ల్రాజన్యాస్త్రాళిచేత వ్రణమునఁ బడిన న్రాక్షసాధీశుఁ డేగన్
రాజన్యాసీరవాజివ్రజఖురజరజోరాజి ఘోరాజభూమి
న్రాజీవాప్తుం గ్రహింప న్రభసమునఁ బయోరాసులన్సంగ్రహింపన్. 126

వ. ఇట్లు సంరంభవిజృంభమాణుండై కాళికాముఖుండు బర్హిర్ముఖవిరోధిదిశాధికముఖంబులం జలింపఁ బంచదశాక్షౌహిణీయుక్తుండై మూర్ధాభిషిక్తునిపయిం గవిసిన నసిముసలభిండివాలముద్గరతోమరప్రాస శరాసనప్రముఖ నానావిధప్రహరణంబులం

1 వేఁట.

గుప్పించినం దప్పించుకొనుచు నుప్పరవీదికిం దత్తటిల్లతలంగల్పించుపోలికఁ గనకపుం ఖశిలీముఖంబులు వఱపి యాకసంబునం [1]గనకసంఘంబువోలె నల్లగదులశరంబులు దట్టంబుగ నేసి యువిహాయసంబునసురాయంచకదుపులెగయుచందంబునం దెల్లపింజె లమ్ములంబులేసియు మహానక్రంబు సముద్రక్రోడంబునుంబోలె విక్రమాభిక్రమంబున నుక్కు మిగిలి యాశక్రారిసేనానక్రాకరంబుఁ జొచ్చి శోధించి కలంచి కలగుండు సేసి మట్టిమల్లాడి వెరఁజి వెంపరలువెట్టి యచ్చిపోయిన తెరువెల్లఁగరాక యొక్కెడఁ జూచిన రథమయంబై యొకయెడఁ జూచిన దుష్యంతమయంబయ్యును నేనిశాచరుం జూచిన శరమయంబయ్యె నుండె నట్టి బెట్టిదంపు మోహరంబున. 127

చ. తొడుగుట కానరాక వెసతోడన యేయుట కానరాక పై
వెడలుట కానరాక యుడువీథికిఁ బోవుట కానరాక య
య్యుడువిభునంశసంభవుని యుగ్రశరంబుల దైత్యమస్తము
ల్వడుటయు రక్తవాహినులు వాఱుటయుం గనవచ్చె నాజిలోన్. 128

గీ. హస్తిపురరాజశరవాతహతిని ద్రెళ్ళి, రాసులై యుండె సంగ్రామరంగమునను
వరిదిప్రోవులు వేసిన నల్లపేటి, తాటికాయలగతి దైత్యతతుల తలలు. 129

ఉ. అట్టులు ద్రెంచి దానవుల నాహవభూమి విభుండుగూల్చినం
గొట్టులఁదెచ్చి జాతరకుఁ గోసినపోలికనుండె మేదముం
జుట్టుచు మాంసము ల్చవులుచూచుచు భూతములుండె నాజిలో
గట్టునఁ దేన్చుచుం జయముగాథలు పాడుచు సోలియాడుచున్. 130

వ. ఇవ్విధంబున నుండె నంతట. 131

క. బలమెల్లఁ దెగిన నిజదో, ర్బలముం జలముం బ్రతాపపావకుఁడును ను
జ్జ్వలశస్త్రాస్త్రంబుల నిజ, బలముగ నెదిరించె దనుజపతి నరపతితోన్. 132

శా. నిన్నున్ మెచ్చితి సైన్యముల్పొరుగుపోనీ దీననాకేమియు
న్విన్నంబాటు ఘటింపనేరదు సురానీకంబులం బోరుల
న్వెన్నుల్దన్పిన నన్ను మార్కొనెదుచో వీర్యం బవార్యంబుగా
సన్నద్ధుండవుగమ్ము చూపు నిజశస్త్రప్రౌఢియు న్ప్రౌఢియున్. 133

మ. అనినం గొండొక నవ్వి యేల యిటు వీరాలాపము ల్దద్భుజా
ఘనకోదండము కాలదండము భవత్కాయంబు నవ్యంబు భూ
తనికాయంబున కిత్తుఁ బో విడువఁ బాతాళంబు భేదించి చొ
చ్చినఁ జక్రాంకుఁడు తోడువచ్చిన మహాశేషుండు దాపచ్చినన్. 134

1 కాకసంఘంబు.

క. అని వీరోక్తులతోడన, యనిసేయఁగడంగె మానవాధిపుఁ డచ్చో
మనుజాధిపదనుజాధిపు, లనుపొందిరి రామరావణాకారములన్. 135

శా. ఉల్లంబుల్ రణకౌతుకంబున సముద్యోగించి సామ్యంబులై
యుల్లాసంబులు వీరరేఖలును నుద్యోగింప నొక్కంతలై
భల్లాసారము పెల్లుగా వసుమతీపాలుండు దైత్యుండు సం
భల్లీలాగతిఁ బేర్చి మార్కొనిరి ప్రాబల్యంబు తుల్యంబుగన్. 136

గీ. దనుజశరములు భూభర్తదునుము నృపుని, శరము లమరారిదునుము నయ్యిరువురకును
జయము నజయంబు నవ్యవస్థంబులయ్యెఁ, దూఁచివేసినగతినుండె దోర్బలములు.

క. ఈకరణిఘనూరణము, స్తోకగతింజేయుచుండి దోర్బల మొప్పన్
భూకాంతుఁడు నొసలేసెను, భీకరబాణమున నసురపెడతలవెడలన్. 138

మ. సురవిద్వేషి తదస్త్రపాతమున సంక్షోభించి యొక్కమ్మున
న్నరలోకేశు నురోవిభాగము వడి న్నాటించి యాలమ్ములం
గరముల్వాయకసప్తకమ్మున [1]బరుల్గట్టంగ బెట్టేయనా
ధరణీనాథుఁడు లెక్కసేయక తనుత్సాహంబు దాహంబుగన్. 139

క. అక్షుద్రశితశరంబులఁ, బ్రక్షుభితుంజగుచునేసి ప్రధనక్రీడ
న్వీక్షింపు మనుచు రాక్షసు, వక్షము జయలక్ష్మికిని గవాక్షము చేసెన్. 140

గీ. ధారుణీపాలుఁడేచిన దహనతీవ్ర, సమశిలీముఖముల వేఁడిఁ జాలనొచ్చి
దర్పమెడలక విలుగుణధ్వని యొనర్చి, భీకరధ్వని దిక్కులు పెకలనార్చె. 141

సీ. పలలాశివిభుఁడేసె బైశాచబాణంబు భైరవాస్త్రంబు భూపాలుఁడేసె
వ్యాళక్షురప్రంబుఁ గాళికాముఖుఁడేసె గరుడభల్లంబేసె నరవరుండు
పావకాంబకము విభావరీచరుఁడేసె శశికులీనుండేసె జలశరంబు
తిమిరప్రదరమేసె దితినందనుఁడు భానుసాయక మిభపురస్వామియేసె

తే. నామహారాజుచేత దివ్యాస్త్రనిచయ, మచటఁ దోడ్తోన ప్రతిహతమగుటఁ జూచి
తనకు నంతకుచే వరదత్తమైన, తీవ్రశక్తిం బ్రయోగించి తివురుటయును. 142

మ. శరదర్కద్యుతికర్కశాంశువగు నాశక్తిన్నివారింపఁగా
శరముల్గానక యేసె దానవునిపై సంధించి బ్రహ్మాస్త్రము
న్నరవైరాకరసైన్యనాథ సుషమాశుద్ధాంతకాంతాసుదు
ష్కరవైధవ్యమహావ్రతప్రకటదీక్షాసత్క్రియాశాస్త్రమున్. 143

1 గరుల్గ.

గీ. ఆహవక్షోణియందు బ్రహ్మాస్త్రవహ్ని, విస్మయంబుగ సురవైరి భస్మమయ్యెఁ
త్రిపురఘస్మరు నిటలాక్ష తీవ్రవహ్ని, భస్మమైనట్టి సంకల్పభవుఁడు వోలె. 144

క. దనుజుఁ బరిమార్చి ముందటి, కిని దానవబాధఁదీర్చి కృతకృత్యుండై
మునిజనములు హర్షింపఁగ, జననాయకమౌళి విజయశంఖం బొత్తెన్. 145

క. ఆవేళ వచ్చి మౌనులు, పావనమంత్రోదకములు పైఁ బ్రోక్షింప
న్భూవరు మేనికి శిశిరసు, ధావర్షంబై రణవ్యథన్ హరియించెన్. 146

వ. ఇట్లు సంజీవనమహితమంత్రజలంబులచేత బ్రభూతంబైన యాతుధాన శాతశరజాతవ్యథనపనయింపంజేసిమునీంద్రులతనితో మాభాగధేయంబుననిచ్చటికివిచ్చేసినకతంబున, యాగంబు సుప్రయోగంబుగాఁజాగె నీకాళికాముఖుండు పాకశాసన పావక పరేతరాజ పలాశిపాశిపవన పౌలస్త్యపన్నగాభరణులకు నజేయుండు, వీఁడు భవదీయబాహుదండకోదండకాండ ప్రచండశిఖిశిఖాముఖంబున [1]భక్షితుండయ్యెఁ గావున నేతత్క్షణంబుననుండి రక్షోభయం బెన్నటికిని [2]సునయంబయ్యె మాజపతపోనిష్ఠానుష్ఠానంబుల షష్ఠాంశంబుఁగొనం గర్తవు కీర్తనీయచరిత్ర జగద్ధితకీర్తివై మీ వంశకర్తలగు చంద్రసౌమ్యపురూరవశ్చక్రవర్తులంబోలి యేకచక్రంబుగాఁ జక్రాచలమధ్య మహీచక్రం బవక్రం బగు విక్రమంబున నప్రతిపదంబగు ప్రతాపంబున ననశ్వరంబగు నైశ్వర్యంబునం బరిపాలింపుమని యాశీర్వదించి యనుప వనుపమానభయభక్తితాత్పర్యంబుల మునివర్యులకు నృపవర్యుండు నమస్కరించివీడ్కొని విడిదలకునరిగి మజ్జనాదికృత్యంబులు వెడవెడఁ దీర్చి శకుంతలావలోకనంబునకు లోకలోచనుం గనుంగొను నప్పుడు. 147

క. బింబఫలకాంతిరవిబిం, బంబరుణద్యుతి వహించెఁ బాశధరాశా
స్తంబేరమకంఠచ్యుత, జాంబూనదఘంటవోలెఁ జరమాద్రిపయిన్. 148

మ. మునిదత్తార్ఘ్యపయఃప్రహారకులిశంబుల్దాఁకి మందేహదే
హనితాంతస్రుతరక్తధారచెలువంబై పశ్చిమాశాతటిం
గనుపట్టె న్నెఱసంజచాయలరుచు ల్గాంక్షించి యచ్చోటికిన్
జను కాకోలకులంబునా దెసల నోజం జీఁకటు ల్గ్రమ్మఁగన్. 149

ఉ. జారులు చోరులు న్నిగుల సంతసమందఁగఁ జక్రవాకము
ల్దారలఁ దారు నశ్రుజలధారలు గ్రమ్మఁగ నుమ్మలింప నిం
డారె నజాండభాండమున నంతకశాసనకంధరాంతర
స్ఫారవిశాలకాలరుచిబంధురబంధు మదాంధకారముల్. 150

---

1 భస్మితుండ. 2 విచ్చేసెనయ్యె.

క. పాటిగ మిఱుఁ బల్లంబై, ర్వాటేమియు లేక కానఁబడె నీలశిలా
పేటియు నడినిండఁగనిడు, కాటుకయుం బోలెనై జగంబునుఁ దమముల్. 151

ఉ. నాలుగుదిక్కులందును ఘనంబుగఁ బర్వినచీఁకటుల్ జగ
ద్గోళము నిండి దృష్టికి నగోచరమై వెసఁ బర్వమండఁగా
నీలపటంబుమీఁది విపణిం బచరించిన ముత్తియంబులం
బోలివెలింగె నంతట నభోవలయంబునఁ దారకావళుల్. 152

వ. తదనంతరంబ. 153

మ. కుముదోజ్జీవనమంత్ర మంగజభుజాకోదండగర్వంబు సం
తమసా[1]నేపకకూటపాకలము జ్యోత్స్నావర్షి వర్షాపయో
దము పాంథవ్రజచిత్తశల్యము నిశాధమ్మిల్ల బంధూకగు
చ్ఛము ప్రాచీనగశృంగవీథిఁ బొడిచెం జంద్రుండు సాంద్రద్యుతిన్. 154

సీ. పాంథలోచనవారిఁ బదనీ నమర్చిన సంతప్తపరశువు కంతునకును
బ్రాచీదిశాపతి పావడఁ బెనచిన మవ్వంపుఁ జిగురల్లి మన్మథునకు
నాత్మప్రతాపాగ్ని నవతారమొందంగ నంగారఖండ మనంగునకును
గౌముదీ జలధి వేడ్కకు నీఁడఁదెచ్చిన పవడంపుఁగుంభంబు భావజునకు

తే. ననెడు విచికిత్స జనులకు నావహిల్లఁ, జక్రవాకము లెడఁబాయ జారసతులు
డాయ నబ్జవిలాసంబు దాఁపరీఁడు, ప్రాచికొనరించెఁ గుసుమపూబంతి చెలువు.

గీ. అంతఁ జూజూడగా రాగకాంతి విడిచి, యల్లనల్లన యుడురాజు తెల్లనయ్యె
రాగి బలుగట్టి సురసప్రయోగమునను, ధాతువాదిచే రజతమై తనరినట్లు. 156

గీ. గరళమునకింత [2]మిన్న నక్షత్రనాథుఁ, డరయ నొకపాటిగాఁడు దోషాకరుండు
ఒడలుగందినయది యందయోషగాక, [3]కవియునో యని బద్మిని కన్నుమొగిచె. 157

క. కాశహారహాసకుముదా, కాశనదీద్విరదరదనకరకాహిమనీ
కాశయయి యాసలం దవ, కాశము లేకుండ నిండి కౌముది కాసెన్. 158

మ. కలయం జంద్రికసోఁకఁ గర్ణికలు బొంకంబెక్కి యంతంతకుం
గలికాగ్రంబులఁ బట్టువాసి నెరయంగావిచ్చి తోరంపుటు
గ్గులు వీడం బెడవీఁకవీడి వలికొను ల్కాళము ల్దాయలో
దళము ల్బింకము చూపఁగాఁ గలువ లందంబొందెఁ గ్రొత్తావులన్. 159

చ. ఎఱకలు దిద్ది కంధరము లెత్తి మొగిం జరలాట మున్నుగాఁ
బఱచుచు లేఁతవెన్నెలలు పారణసేయుచు మించి చంచల

1 నేకప. 2 పిన్న. 3 కలియు.

న్నలఁతినఁ దోనపుట్టి కిరణంపుఁగొనల్గొని మోము మోముతో
నిడియుచుఁ జేర్చి ప్రేయసులకిచ్చుచు నాడె దివిం జకోరముల్. 160

క. ఆసమయంబున వెన్నెల, బాసటమునఁ దోఁచి తోఁచి పార్థివమణిపై
నేసె మనోభవుఁ డెంతయుఁ, గాసిలి యొలదేఁటిఱెక్కగరుల శరంబుల్. 161

గీ. మునుల మంత్రబలంబున దనుజతీవ్ర, మార్గణవ్రణములబాధ మానెఁగాని
మానకెంతేనియును మేను మండఁ దొడఁగె, నరపతికిఁ జిత్తభవమార్గణవ్రణములు.

మ. కుపితానంగశరాగ్నిదాఘమున నాక్షోణీవిభుం డెంతయుం
దపియింపన్వెస నుగ్రభానురుచు లుద్గారించుచుం జంద్రికా
తపము న్మించినఁ గ్రిందుమీఁ [1]దిఱుకుడై తాపంబు రెట్టింప నే
యుపచారంబున మానునొక్కొ యిదియం చూహించి చిత్తంబునన్. 163

సీ. మోహనాస్పదమైన బాహుశాఖలచేతఁ గమనీయకరపల్లవములచేత
గోమలనఖశిఖాకోరకంబులచేత విమలహారప్రసూనములచేత
సమపీనవర్తులస్తనగుచ్ఛములచేత రమణీయదేహసౌరభముచేత
సంచారజస్వేదజల[2]మందరముచేతఁ జికురరోయమధుకరశ్రేణిచేతఁ
గలితమైన శకుంతలాకల్పలతిక, నీడ నొదుగకయున్న నేజాడనాఱుఁ
గుటిలసంకల్పసంభవక్రూరపుష్ప, చాపశరజాలసంజాతతాపభరము. 164

ఉ. ఎత్తినమన్మథాగ్ని నెద [3]యేఁచెడు తాపభరంబుఁ దీర్పఁగాఁ
గ్రొత్త విరుల్మృణాళములు గొజ్జఁగినీరుఁ బటీరమోపు నే
హత్తి శకుంతలాధరపుటామృతపూరము లూర్పువుచ్చకేఁ
గుత్తుకబంటిగాఁ గడఁగి కూర్కొని కూర్కొని త్రావకుండినన్. 165

నలినాక్షి నను జూచి యలుకలు దీర్చెనేఁ దిరివిప్ప నడవనే తేఁటినారిఁ
జంద్రాస్య నన్ను భ్రూసంజ్ఞ మన్నించెనే శిశువుల కొసఁగనే చెఱకువిల్లుఁ
గంబుకంధరినన్నుఁ గడకంటఁ జూచెనేఁ జదనేయనే పుష్పసాయకంబుఁ
గిసలయాధరి నన్నుఁ గెంగేలనంటెనేఁ జిదుమదే కొనఁగోరఁ జిగురుఁగత్తి
మేలయేఁపు మనున్నాఁ డుహృదయభవుడు, నెలఁతయును నేనుసమదృష్టినిలిచినపుడు
దేలుపోవును దాన యీకీలెఱుఁగఁడు, తెల్లవాఱంగ వలెఁ గదా దేవకృపను.

ని యనేకప్రకారంబులఁ జింతాసంతప్తుండై శకుంతలామనోహరాకారంబు మనం నం బెట్టుకొని పరబ్రహ్మంబు నవలోకించు పరమయోగిచందంబున భూకాం కుం డుండె నంత నిక్కడ శకుంతలయు నాశ్రమవనాంతంబున. 167

1 దుడుకుడై. 2 మరంద. 3 యొండెను.

క. అనికిం గరిపురనాథుఁడు, చనినది మొదలుగను జయము సమకూఱినదాఁ
కను నిష్టదేవతాప్రా, ర్థనముం జేయుచును దత్పరత వర్తిలుచున్. 168
గీ. జయముఁ గైకొని తన నిజేశ్వరుఁడు మగిడి, విడిదలకు నేగె ననువార్తవినుచు లలన
వినియెఁ గర్ణద్వయీ కటువిషమబాణ, ఝంకృతిస్ఫార శింజినీటంకృతములు. 169
చ. తలఁగఁగ [1]నిచ్చునెట్లు వసుధాపతి దారసమైన యట్టిచోఁ
దలరి మదీయశాసనముఁ దప్పుట యెట్లొకొ తాల్మి[2]నంచుఁ దాఁ
జెలఁగి చెలంగి మానసము చిల్లులువోవఁగ నేసెఁ బాలిక
న్వలపులరాచజోదు ప్రసవంబులపేరను గొర్వికోలలన్. 170
క. వాలికపూములుకులు త, త్కాలంబునఁ దొంటియంపగంట్లను రేఁగం
జాలఁగ నురిసినపుండులు, కోలఁగెలకుననుటాశకుంతలకయ్యెన్. 171
క. గణనకు ఘనమై మరుమా, ర్గణములు చిత్తజుఁడు గురియఁగా నారమణీ
మణి లేచి పర్ణశాలాం, గణమున కేతెంచి నిలిచి కనుఁగొన నెదురన్. 172
సీ. విరహులపైఁ జల్ల విషపుఁజూర్ణము నించి పట్టిన దంతంపుబరిణ యనఁగఁ
దెప్పించి పాంథులఁ దెగటార్ప శశికాంతశిల ఘటించిన వధ్యశిలయ పోలెఁ
గాంతాపరాధులఁ గౌముదిం దొడికింపఁ బెట్టిన పటికంపుబిందె యనఁగ
వెసవియోగులఁ దెగవ్రేయఁ బుల్గడిగించి నిలిపిన గండగొడ్డలి యనంగ
తే. ముదురవెన్నెల గిన్నెలముంచవచ్చు, కరణి నుత్ఫుల్లకాశనీకాశ యగుచుఁ
దెల్లవాటి మధ్యందినాదిత్యుఁ డనఁగఁ, దనరు శశిఁ జూచె నాశకుంతలభయమున.
గీ. శంబరారాతి శరవహ్ని సైఁపలేక, పర్ణశాలాంచలంబుల బయల నిలువ
సెకలు దేహంబునం దెల్లఁ జెఱచిపాఱె, నతివపై వడజల్లెఁ జంద్రాతపంబు. 174
క. ఉడురాజదీధితులఁ దిరు, గుడుపడి తపియించుచును శకుంతలయుండెం
బుడమిజనంబులు వెన్నెల, వడఁదాఁకను మాట నిక్కువం బైయుండెన్. 175
వ. అయ్యవసరంబున ననసూయాప్రియంవద లత్తలిరుఁబోఁడి మెత్తమెత్తన యెత్తుకొనిపోయి క్రొత్తనెత్తమ్మిఱేకులం గల్పించిన తల్పంబు సేర్చి శిశిరకృత్యంబులు సేయం దత్సమయంబున. 176
సీ. చనుదోయిఁ బొందిన జలజపత్త్రంబులు రవరవరజములై రాలిపోయెఁ
గర్ణావతంసంబు కలువలు కన్నీళ్ల నురిసి ఱేకులు పట్టు మఱిసిపడియె
నురము గంధంబు చిట్టుడుకువట్టినఁ బొంగి యందందమండ బేరావు లెగసె
హారవల్లికలు గా నమరించిన మృణాలకిసలయంబులు పచ్చిగిజ్జడయ్యె

1 నిల్చు. 2 యంచు. 3 కోలగెలకుననుటయా.

తే. జిగిదలిర్చిన క్రొమ్మావి చిగురుఁబఱపు, పెట్టుపెట్టినచందాన [1]నట్టకట్టె
నగ్నికాజ్యాహుతులు వోసినట్టిదయ్యె, సకియవిరహానలమునకు శైత్యవిధులు.
గీ. కొమ్మవిరహాగ్ని వేదనకోలఁది [2]యెద్ది, పదతలంబుల నిగిడించు ప్రసవరజము
మంగలంబున వేఁచినమాడ్కిఁ దెరలెఁ, బెక్కుసఖులకు నఱచేతఁ బొక్కులెగసె.

క. ఎంతెంత శిశిరకృత్యం, బంతంతయ విరహవహ్ని యధికము గాఁగం
గాంత తనచెలుల చిత్తక్లాంతియుఁ బడుపాటుఁ జూచి కన్నీరొలుకన్. 179
గీ. మానవతులార యిన్నాళ్ళమరుఁడు కాఁడు, యింతనొప్పించినాఁడె నన్నెన్నఁడైన
నిండువెన్నెల యనుపేరి నేయి జల్లి, చంపుచున్నాఁడు చంద్రుండు చల్లజంపు.
సీ. తనరశ్మినొల్లక తగువారిలో మను తమ్ములఁ జెఱచు పాతకుఁడు వీఁడె
చదువఁగాఁ బోయి యాచార్యుని కులభామ జడుపుచేసిన దోసకారి వీఁడె
హరిణాంకమనుపేర నపరసం బగు నల్ల గుట్టుదట్టిన చెడుగొట్టు వీఁడె
పదునైదుదినముల బ్రతుకుకై సరివాని దిననాథు నాసించు తిరిపె వీఁడె
తే. తనదుతెరాకకుఁ గ్రాఁగి కాతరత నొంది, విరుల బొరియలడాఁగిన విరహిజనుల
చొప్పుఁబడి పట్టుకొనిచుఱచుండ్లుచూడఁ, గుసుమబాణుని తెచ్చినకొఱవి వీఁడె.
వ. అదియునుం గాక. 182

సీ. తనకు బాడబమహాదహనసంగతఘోరమకరాకరంబు జన్మస్థలంబు
తనసహోదరులు కాదంబరీనామ[4]హాలాహుహాభీలహాలాహలములు
తనశరీరముఁ బ్రోచుకొనుట తీవ్రకఠోర హరిదశ్వకిరణభిక్షాటనమునఁ
దనకు సంతసపాంథజనహర్త పాపిష్ఠియంగహీనుఁడు కూర్మి సంగడీఁడు
తే. పద్మినికిఁ గీడొనర్చెడు పాపజాతి, చక్రవాక వియోగాగ్ని సామిధేని
విరహిజనములపాలింటి వేరువిత్తు, దురితములకేలవాయోడుఁ దుహినకరుఁడు. 183
వ. అని మఱియు నిట్లనియె. 184
సీ. భద్రకాళీభర్త పదతలాహతి బల్లి పరవోలె నెపమారఁ బ్రామడయ్యె
దక్షకోపజమైన యాక్షయవ్యాధి నిర్జీవిగా నాశిలఁ జేయదయ్యె
నమృత మంతయుఁ ద్రావి యంకసారంగంబు బింబమెల్లను నిండబెరుఁగదయ్యె
నాచార్యుఁ డనకభార్యకుఁ దప్పినప్పుడు పొడుగఱ నీరంకు పొడువదయ్యెఁ
తే. ప్రథమకళ యారగించెడు పావకుండు, మీఁగడయుఁబోలెఁ గడిచేసి మ్రింగఁడయ్యె
నేల యిటుసేయఁ బాంథులపాలవీథి, వనజగర్భుండు వ్రాసిన వ్రాఁతఫలము. 185
వ. అని యుపాలంభించి యారంభోరువు కరాంభోరుహంబులు మొగిడ్చి మహాపరాధం

1 లఁగట్టు. 2 యంది 3 గాకను. 4 హాలా.

బుఁజేసితినని యతండు మన్మనోనాథు వంశనాథుండు వంద్యుండుగాని నింద్యుండు
కాఁడని. 186

శా. స్వామీ చంద్రమ తావకాన్వయుఁడు దుష్యంతుండు భూపాలచూ
డామాణిక్యము నీకుఁదామనుమఁ డౌటన్బెక్కువాక్యంబులే
లామాతాతవు[1]నీవు నేమనుమరాలంగాన మేలంబుగా
నామాటల్విను తప్పుపట్టకు మది న్మన్నించు గారాముననే. 187

మ. జననంబొందితి దుగ్ధవారినిధి నాసర్వేశు జూటంబుపైఁ
జనుదేప్రొద్దుఁ బ్రశంససేయ నవతంసంబైతి నీప్రాభవం
బునకుం బాంథజనాపకారియగు నాపూవిల్తునింగూడివా
రనిదుష్కీర్తిగఁ దిట్టునంబడకు చంద్రా రోహిణీవల్లభా. 188

వ. నన్నుమన్నించుమని యక్కన్నెవెన్నెలరాచవేలుపుం బ్రశంసించి నృశంసుండగు
ప్రసవబాణు నుపలక్షించి. 189

సీ వావిఁదప్పించితి వనజాసనునియంతవానికిఁ గూఁతు[2]రువలపుఁగఱపి
దోషంబు గట్టి తిందునియంతవానికి గురుకళత్రంబుపై మరులుగొలిపి
బలుగోడిఁజేసితి పాకశాసనునంతవాని నహల్యకై వాసి చెఱచి
నెరసు వట్టితి పరాశరులంతవాని నట్టేటఁ బామరుకన్నె[3]గాటుమఱపి
తే. నీప్రతాపంబు లెన్నియెన్నికకులేవు, తొడిఁబడితినాఁటదాన నీతోయమునను
నన్నుమన్నింపు దుష్యంతునకు ఘటింపు, మయ్యవెఱతును మదన జోహారునీకు.

సీ. పాపకన్నెలుమేఁతపట్టి పోవిడుచుచో వెసగాడ్పుఱెక్కలు విఱిగెనేని
గలకమామిడిపండ్లఁగల[4]జీడిమధుకరపోతంబునాలుక పొక్కెనేని
జంపకప్రసవవాసనసోఁకి యొలదేఁటికూలి విజ్జునఁ దన్నికొనియెనేని
నిగురుమేఁతలనొగ లెక్కి కోకిలకును వడిఱొమ్ము గడిసిలఁబడియెనేని
తే. దీయవిలు జీవగమి దొల్చి తినియెనేని, బొదలునావేఁడియూర్పులఁబువ్వుఁదేరు
కమ[5]రెనే బట్టబయలగుగర్వరేఖ, విషమసాయక విచ్చేయు విడిదలకును. 191

వ. ఇట్లు బహుప్రకారంబుల మన్మథవికారంబులకుం గలాపంబులుగాఁ బ్రలాపంబు
లు నెఱపుచు వాగురాయష్టి మృగయుండునుంబోలె భూపాలుండు తనపాలికివచ్చి
న భావంబు భావించుచు నయ్యాదిగర్వేశ్వరుండు నర్మగర్భంబులుగా సఖీజనంబు
లతోడనాడిన సల్లాపంబులందలంచుచు నాసింధురపురవరాధీశుండు గాంధర్వంబు
నం దనుంగర[6]గ్రహణంబొనర్చిన విలాసంబు లాసించుచుఁ గారాకుచప్పుడైనవప్పు

1 నీవు. 2 రి?. 3 పాటు. 4 జీడిచేఁ గీర. 5 రనీ. 6 గ్రహణంబుచేసిన.

మప్పుడమి శేషంరాకగాశంకించి దిగ్గనలేచి దిక్కులవలోకించుచుం గానక కళవళించు చుం గాంతాపరిక్లాంతిం గనుమూసియు మాయమి నన్నురేంద్రచంద్రునిం గలంగల యుంగాంచి బయలుగౌఁగిలించుచుఁ గలవరించుచుఁ బలవరించుచుం గుందుచుం బొ ఱలుచుం వెలుచు వనరుచుం గనరుచు నొగులుచుం బొగులుచుం గసరుచుం గొస రుచు వేసరుచు నాసరుచు [1]నసురనుచు నసురనుచు నుల్లంబొల్లంబోయి మూర్ఛి ల్లిన నప్పుల్లవాఘరింగనుంగొని. 192

గీ. సరస నవమాయయును బ్రియంవదయుఁజేరి, యల్లనల్లనశిశిరకృత్యములు సేయఁ గ్రమముతోఁ గుంత వెడవెడఁగనులు దెఱచి, సమధికామోదతాళవృంతములు సూచి.

మ. విసరుంజూడకుఁడమ్మ పూవుసురటు ల్విశ్రాంతిమూలంబుగా నసువుల్వాపుఁ దదంతరాంతరనితాంతామోద హేలాలతాం తసమాక్రాంతకృతాంతరూపపవమాన ప్రేంకణప్రక్రియా వసరోదంచితచారుసౌరభరసవ్యాలోలరోలంబముల్. 194

ఉ. సూదులు ద్రిప్పు చంద మగుచు న్వెతవెట్టకయుండ నెచ్చెలు ల్గాదులు వెట్టరే చెవులలోపల సంతతపాంథలోక హృ ద్బాధలు మత్తరాజశుకభీషణభాషలు బాలపల్లవా స్వాదకషాయకంఠవిలసత్కలకంఠకటుస్వనంబులన్. 195

గీ. తెల్లవాఱినవెఱవ నేదేవతలకు, నల్లభుఁడు నన్ను రక్షింపవచ్చుఁ గాన భావజునిచేత నీలోనఁ జావకుండ, నరయుఁ డోయన్న నెచ్చెలు లతివఁజూచి.

మ. వనితా యాతనిఁ బోలలే దనెడు నీవంత న్మరుం డంతరిం చునిజం బప్పుడు వేల్పు లప్పుడవికి న్శోధించి పట్టాభిషే చనముం జేయుదు రద్ధి నిన్నిట రతిస్థానంబున న్నిల్పి రూ పున దుష్యంతనృపాలుఁ డర్హుఁ డగుటం బుష్పాస్త్రపట్టంబునన్. 197

వ. అని సఖీజనం బుపలాలించు నయ్యవసరంబున. 198

ఉ. తోయజపుష్పబాంధవుఁడు తూరుపుఁగొండకు రాఁదలంచె భూ నాయకుఁడు న్శకుంతల మనంబలరం జనుదెంచుఁ దుమ్మెద ల్మ్రోయుఁడీ శుకంబులు నెలుంగులు సేయుఁడీ పికంబులుం గూయుఁడీ ప్రమాదమని కూకలువేసినభంగిఁ గొక్కొరో కోయని బిట్టుమ్రోసెఁ దొలుకోడినికుంజకుటీరవాటికన్. 199

వ. తదనంతరంబ. 200

---

1 నసురనసురనుచు, నుసురుసురనుచు.

సీ. కుముదంబు లర్ధమర్ధము మొగంబు మొగిడ్చె నర్ధమర్ధంబు తోయజము విరిసె
స్యందనాంగం బింతనంతనుం జరియించె నింతనింతఁ జకోరమీకలిరికె
విధుకాంతశిల వెడవెడనీరిగిరి తీసె వెడసూర్యకాంతంబు వెచ్చనయ్యె
నిసియించుకించుక దెసలయంచులనిల్చె నించుకించుక దివం బీరికెత్తెఁ
తే. వాలఁగిపోయెడు కుముదబంధుద్యుతియును, దోఁపుచున్న సరోజబంధుద్యుతియును
శబళమై శ్వేతరక్తముల్ సంక్రమించె, సకలదిశలను బ్రత్యూషసమయమునను. 201

సీ. కావికోణాము లాకాశసన్యాసి కంబరకపాలికులకు మర్లుజడలు
చిరురాకు[1]బరకెలు గగనచూతమునకు వలఁతియూడలు వియద్వటమునకును
సట లంతరిక్షకేసరికంధరమునకు జమలియాఁకలు నభశ్చాపమునకు
రాగిమీసంబు లభ్రకిరాతు మొగమునఁ బగడంపులతలుడుపథపయోధి
తే. కనెడు సందేహచింతనం బావహిల్ల, [2]యావకద్రవరేఖల యందమొంది
పట్టుసూత్రవితానంబుఁ బరిభవించి, యాకసముఁ బ్రాఁకెఁ దూర్పున నరుణరుచులు.

సీ. ఒక్కింత వెన్నెలయార్చితీసినభంగి నుదధీశుదిశకునై యొడిగిల్లెఁ
గమలి మించెడలిన కంచుటద్దమువోలె నస్తాద్రికడఁ జంద్రుఁడస్తమిల్లె
జలము లూటలు గ్రమ్ము శశికాంతపాషాణనీలంబు లీకెటారి నీరుదివియ
భానుభృత్పాషాణఫలకమధ్యంబులఁ గోకయుగ్మము కంతుగోష్ఠి నెఱప
తే. నబ్జగంధంబు తేఁటుల నాహుతింపఁ, దికమకలు గొని నాలుగుదిక్కులకును
విచ్చివిచ్చిచకోరము ల్వెళ్ళఁబాఱ, నల్లనల్లన తూరుపుదెల్లవాఱె. 203

క. అంతటఁ బ్రాతస్సంధ్యా, సంతర్పణఫలముఁ గాంచి సంయములకు ది
గ్దంతి గొని యెత్తి వైచెనొ, యింతటఁ బడ నగఁ బ్రాచి నినుఁడుదయించెన్.

ఉ. అంకిలిలేక చందిరకులాగ్రణి నేఁడు శకుంతలామన
శ్శంకరుఁ డయ్యెడుం గలుగు శాత్రవ మాతనితోడ నంచు మీ
నాంకున కంగరక్షకయి యామిని కేఁడొనరించినట్టి యా
మంకెనపూవుకేడెమన [4]మండలమొప్పె మరీచిమాలికిన్. 205

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు దుష్యంతమహీకాంతుండు సంధ్యావందనం బొ
నర్చి స్యందనారూఢుండై విడిదల వెడలి యవక్రపదక్రమ మహీసురసమూహప
ఠ్యమానవేదనాదంబుల నవిచ్ఛిన్నహూయమాన మహాగ్నిహోత్ర స్వాహాశబ్దం
బుల ముఖరితంబగు మఖవాటంబుఁ జేరవచ్చి సైకటికంబున రథావతరణంబు చేసి
యర్చిష్మత్తుల్య తేజు లగు మునీంద్రులకుం గృతనమస్కారుండై. 206

1 బఱకులు. 2 యాస. 3 దీర. 4 మండలమొప్పె.

క. ఎన్నఁటికిఁ జిక్క కెదురిచ, టన్నరభోజనుల కయ్యె నపగతభయులై
జన్నముఁ గావింపుఁ డవి, చ్ఛిన్నముగాఁ జాలసంతసిల్లినమతులన్. 207

గీ. అంతనింతను నేనును వరసికొనుచు, సంచరించెద ననిన నాసంయమీంద్రు
లనుమతించిన వీడ్కొని యాశకుంత, లావిహారవనాంతరస్థలముఁ జొచ్చి. 208

మ. కలకంఠధ్వనుల న్మదాళికులఝుంకారంబులం గీరభా
షల మందానిలురాకల న్బరిమళశ్లాఘ్యంబులై యొప్పు పు
ష్పలతాకుంజగృహంబుల న్విరహతాపం బద్భుతంబై శకుం
తల మున్నున్న ప్రసూనతల్పమునకుం దాఁజేరి చింతించుచున్. 209

సీ. చెలువబాష్పముల విచ్చిన కల్వపూబంతు లందంద కన్నులనద్దుకొనుచు
వనితయూర్పులవాఁడి వత్తులైనపయోజముకుళంబు లొత్తిలి మూరుకొనుచు
నువిదమైసెకదాఁకి యులిసినబిసలతావలిహారములు మేన వైచికొనుచు
రమణిడెందంబువేఁడిమి మాఁడి మసియైన పుప్పొడి మెయినిండఁ బూసికొనుచుఁ

తే. బొలఁతి సంతాపభరమునఁ బొరలువెట్టె, నెండియొగురుళ్లఁబోయినయిగురుఁ బాన్పు
మీఁదఁ బొరలుచు విరహాగ్నినీఁదుకొనుచుఁ, జిత్తజోన్మాదవృత్తిసాక్షితివరుండు.

క. ఆచంద్రవదనరాకలు, చూచుచు నిట్టూర్పువుచ్చుచుం బానుపుపై
లేచుచుఁ బవళించుచు మఱి, యీచందంబునఁ జరింప నింతటిలోనన్. 211

ఉ. పూని కరంబులం బొదివి బోఁటులు తోడ్కొని తేఱ మన్మథ
గ్లానివహించి చాలఁ గసుగంది శకుంతలప్రాణనాయక
ధ్యానముతోడఁ గన్నులనె ప్రాణము నిల్పి శరీరమాత్రమై
తా నట కేగుదెంచె వడదాఁకిన చెందొవకాఁడవైఖరిన్. 212

ఉ. వచ్చి లతాగృహంబుతలవాకిట బోఁటులుచెప్పిచూపఁగ
న్విచ్చి మనంబులో వెఱపు నెయ్యముఁ దియ్యము దత్తరింతయు
న్మచ్చికయుం గుతూహలము మక్కువయుం దడఁబాటు నొందఁగా
నచ్చపలాక్షి చూచె లలితాననచంద్రుని మానవేంద్రునిన్. 213

క. భూతలనాయకుఁడును నా, శాతోదరిఁ జూచె సంతసము సంభ్రమము
న్బ్రీతియుఁ దగులును వలపును, గౌతుకమును మానసమునఁ గత్తరకలయన్. 214

వ. అయ్యవసరంబునఁ గన్యావరు లన్యోన్యప్రీతియుం బరస్పరవిస్ఫురద్రోమాంచ
సంచయంబును నితరేతరకాతరతాదర్శనంబును మిథశ్శ్లథధీరతాభావంబును భావించి
చూచి యనసూయాప్రియంవదలు శకుంతలాదుష్యంతుల నేకాసనంబున నునిచిరి

ద్దియేనియు నొక్కప్రయోజనవ్యాజంబున నేకాంతంబిచ్చి యెడ[1]గలుగఁ జనిరంత
భూకాంతుండును బ్రియాముఖంబున దృష్టినిలిపి కపోలంబుల నఖంబులు నటింపం
జేయుచు. 215

సీ. రతికిఁ జేరియును జేరమిఁ బాసిపోవఁగా విధియొనర్చిన యారివేర మొకటి
కదనంబులో గెల్వ కలదో లేదోయను సంశయోద్భవమైన జాలియొకటి
మోము చూచినదాఁక నేమెవ్వారలచేతను వినరాని ప్రీతియొకటి
యనుచితం బని రాత్రి చనుదేకనిల్చిన నామీఁదికోపసంతాపమొకటి

తే. నడుమ జాజరకాఁడు మన్మథుఁడు వచ్చి, రాత్రి మల్లడిగాఁ జేయు రాయిడొకటి
యెంతనొప్పించెనోకదా యింతిననుచుఁ, గరయుగంబున బిగియారఁ గౌఁగిలించి.

మ. కొసరుంగొంకును దేర్చి నెన్నొసటఁ జిక్కల్గొన్న నీలాలక
ల్పాసగం దీర్చి ప్రియం బొనర్చి సరవిం బూసజ్జకుం దార్చి మ
న్గుసుమాస్త్రాహతిసంభవం బయిన యాకుం దార్చి పొందార నిం
పెసఁగం గౌఁగిటఁజేర్చి తేల్చె రమణిన్ హేలాసుఖాంభోనిధిన్. 217

వ. అయ్యవసరంబున. 218

సీ. శ్రవణసౌఖ్యంబుగా సాధుస్వనంబున మోవిలనాలాపించె మొకరితేఁటి
మనసురింగులువార మణితక్వణంబునఁ జెంత నల్లన విలసించె శారి
యొలదొక్కపలుకులఁ గులికిగుల్కి నటించెఁ గలికియై తేనెలు చిలుకఁ జిలుక
యింపుపొంపిరిపోవ నింతనంతనునిల్చి పంచమశ్రుతిఁ బిసాళించెఁ బికము

తే. సమ్మదమ్మగ సురతశ్రమమ్ము దేలు, నంతమాత్రంబె పొలసె మందానిలుండు
తాఁకఁ బరిమళ మొకసాటి సోఁకనేసె, బలపుఁదూపుల మసఁడు భూవరునిసతిని.

సీ. అన్యోన్యసంప్రీతినలవరించుచునుండు వలరాజు కూటువ గలుగదయ్యె
రమణీయనూతనరతిరహస్యములకుఁ గామశాస్త్రంబులు కడమలయ్యె
నుద్వేల మగుచుఁ బెల్లుబ్బెడు రాగవార్ధులు లేకమైనను [2]దొంకవయ్యె
నితరేతరప్రీతి నెడలింపఁ దలఁచిన ధృతికిరాఁదెఱపి సిద్ధింపదయ్యె

తే. మమతలును దత్తరింతలు మక్కువలును, జొక్కులునుగౌతుకములునుసోలడములు
బ్రియములును గాముకతలుఁ దబ్బిబ్బులుగను, సతియుబతియురతిక్రీడసలుపునపు [డు.

శా. పాలిండ్లన్నవనీలికాకలికలన్ బ్రాలంబముల్చేసి కం
కేళీకుట్మలరత్నహారములతోఁ గీలించి కర్ణంబులం

---

1 గలసి. 2 దొలఁక.

డాలొప్పారఁగఁ గర్ణికారములఁ దాటంకంబు లర్పించుఁదా
నాలోలాక్షికి నవ్విభుండు నవపుష్పాలంక్రియాఖేలతన్. 221

క. కేయి చకోరస్థితిఁ గవ, వాయక జక్కవల భంగి బగలు మిథునమై
పాయక రేయును బవలును, నాయవనీపతి సుఖించె నతిసయుఁ దానున్. 222

క. పాలయలుకలు ప్రియమైనను, వలయుం బాయునని యోరువక భీతుండై
వలవోకైన శకుంతల, నలగింపఁగ వెఱచుఁ దాను నలఁగఁగ వెఱచున్. 223

వ. ఇవ్విధంబున నవ్వధూరత్నంబుతోడి క్రీడలం దగిలి మునిసమాజసేవావ్యాజంబున నారాజరతిరాజు నిలిచి సారథిని రథంబుఁ గొనిపోవ నియమించి హోమకాలంబున యాగశాలలకుం బోవుచు నొక్కొక్కవేళ మందపవన పరిస్పందనంబునం గందువం గని మందలయి యందంద వచ్చు నిందిందిరంబుల క్రందునం జెందిన మకరందంబునం బొందలరు నలరుగురువిందపందిరుల క్రింద నొక్కొక్కవేళఁ బల్లవంబుల సందులం దెల్లనం దెల్లంగొనిన విరులమొల్లంబుల సుల్లంబు నలసరించు వల్లరులం దావివల్లులు వెదచల్లు నుత్ఫుల్లమల్లికావల్లికామతల్లికాగృహంబుల నొక్కొక్కవేళఁదావులఁ గ్రోవులగు తమ్మిబావులకడలం దూవరుల నీవలిం జెంగలించు తరులతావుల కేవలగు క్రొమ్మావుల క్రేవలను నొక్కొక్కవేళ నప్పటప్పటికి నుప్పతిలం జిప్పిలు పుష్పరసంబు చప్పరించుచు నుప్పరంబునం గొప్పరంబులెగయ దెప్పరంబుగ కుప్పిగంతులుం గొను షట్పదంబుల పదంబులం బడి దొప్పదొరుగు పుష్పాడిం గదిసి యొప్పెడి విప్పుం గల సరోవరంపు టిసుకతిప్పలను వేల్పుటుత్పలగంధియుం దానును గందర్పదర్పం బనల్పంబుగా వర్తింప సప్తరాత్రంబు లరిగె నతిరాత్రసప్తతంతువుం బరిపూర్ణంబయ్యె నంత హస్తినాపురంబున. 224

గీ. కాళికాముఖనామరాక్షసపతికిని, దమపతికి యుద్ధమైన విధంబుఁ గింవ
దంతి గా విని యంచితోత్సాహమునను, దంతిరథవాజిఘుటసముత్కరము గెరలి.

లగడ. ఒలితహృదయము తివిరి లంఘించు నరదములుఁ
గులగిరులపైన దీకొను మదద్విరదములుఁ
దెరలి యురువడి గాలిఁ దెగఁబాఱు వాజులును
సురరాజు సరివచ్చు చుట్టంపురాజులును
దివిజగురుతోడ నుద్దికివచ్చుమాత్యులును
దవిలి సేవించు తాతలనాఁటి భృత్యులును
జాఱు గలుగక [1]నిఱ్ఱు సంధిసౌజన్యులును,

1 నినిఖి.

వేఱొకింతయులేనివిశ్వాసమాన్యులును
సమరసముదుగ్రఖు లగు సత్కృపాపాత్రులును
జెమట నెత్తురుగాఁగ సేవించు మిత్రులును
వేఁటాఱు తునుకలుగ వేయగల సాదులును
సూటిదప్పక యేయు చొక్కంపు జోదులును
కోరి గిరువులు వెట్టికొలుచు జగతీపతులుఁ
బోరులకు ముఖరులై పొలుచు సేనాపతులుఁ
దోలు పోటు కయ్యమునఁ దొడరు నాసీరులును
బలిమిమై జమునైనఁ బఱచు భటవీరులును
గలహావిక్రమకళాకలితులగు పాయకులు
నలఘు బలసంపన్ను లగు వంకనాయకులు
నసిచర్మసంగరసహాయు లగు పారకులు
నసమశాత్రవజయ సమర్థులగు దారకులు
గొండ లగ్గల సరకుగొనని పేరాయులును
దండివనదుర్గభేదకు లయిన కోయలును
మఱియు గణముఖ్యు లగు మల్లురులు నొంటరులు
నెఱబిరుదు శూరులును నెన కెనయు [1]గెంటరులు
వీరాదిగాఁ గల్గు వీరపరివారంబు
చారురుచి నొప్పారు సమరశృంగారంబు
నల్ల జల్లెడలతో నడగారడవి భంగి
బల్లిగట్లంగడల ప్రభల మ్రింగఁగ నింగి
పులికి సింగంబునకుఁ బుట్టు వొందిన కరణి
బలుపు శేవును గల్గు భటుల బింకఁపు సరణి
మొనసి గుబ్బల కేడెముల ఘంటికలు మ్రోయ
మొనలముందట సబళముల సాదనలు సేయ
నరిగె బిళ్లల తాఁకు నశనిఘోషము దొరయ
దిరువులో నడిదముల్ద్రిప్పి యొండొరు మొరయఁ
గోలతో విల్లు దెగఁగొని జిత్తపేరెములుఁ
గాలుకోలఁదియుఁ బఱచు కదనప్రకారములుఁ

1 ఖుచరులును.

బాడ వెగురవైన నప్పుడవచ్చు కుంతములుఁ
దడయ కొరపుగఁ బట్టి తగనిచ్చు పంతములు
వెలయు బొమిడికములును వెనుకపమ్ముల జోళ్లు
నలమికొన నొకఁడు పదునైన తోఁచు పడవాళ్లు
మొనలు చక్కఁగఁ దీర్చి ముఖరులై నడపింప
ఘనవాద్యనాదముగ ఘనఘుంటపూరింప
మెండుకొని కడిమి భూమీజనంబుల చూడ్కి
నిండి సేనాసమితి నేల యీనినమాడ్కి
నహితులకు గుండె ల్లాడంగ నంతంత
మహితసైన్యము నిల్చె మాలినీనదిపొంత. 226

వ. విడిసిన నట్టియెడ నమాత్యసేనానాథులు భూనాయకుం డున్న యాగశాలకుం బోయి మునులకు నమస్కారంబులు చేసి సముచితప్రకారంబున జనవరు సమ్ముఖంబై నిలుచుటయు. 227

క. మునివరులు రాజవదనముఁ, గనుఁగొని సైన్యంబు లెల్లఁ గదనవిధంబు
న్వినివచ్చినారు తోడుగ, నెనయఁగ నీసత్వజనము లెఱుఁగకసుమ్మీ. 228

గీ. అనిన భూపతి వారితో ననఘమతులు, ధరణిసత్క్రి నాకు సిద్దలఁచి యుష్మ
దీయశక్తి నాయందు వర్తింపఁజేసి, గెలుచుటేఁ గాక నరులు దైత్యులకు నెదురె.

క. మీకరుణ పెంపు నాకు స, మీకజయము గలుగు నెల్ల మీకొకలక్ష్యం
బేకోణపకీటంబులు, మీకినుకం బడిన నస్తమించు జగంబుల్. 230

సీ. ప్రసవసాయకవైరి నొసలఁ గన్నూపిన నతికాలఁ గన్నూపినట్టి మహిమ
యవతార మిషమున నవనిపై జనియింప హరిమీఁదఁ గినిసినయట్టి శక్తి
ధాతకు గుడిపూజ ధరణి లేకుండంగ శాసించినట్టి యాజ్ఞాబలంబుఁ
జండాంశు రథముతో జగతిపైఁ ద్రెళ్లంగఁ గన్నెఱ్ఱ చేసిన గర్వమహిమ
తే. గల మహామహులకు మీకు గణనసేయఁ, గ్రవ్యభుక్కులనంగఁ జల్కాసిపురువు
లేను ధన్యుండ మాన్యుండ నిట్టి కీర్తి, క్షితిని నెగడించి గారవించితిరి గాక. 231

వ. అని యత్యంత వినయవచనరచనలం బ్రీతులం జేసినమునిముఖ్యులా నృపముఖ్యుని దయాసుధామయంబు లగువిలోచనంబులం గనుంగొని. 232

సీ. నీవు వచ్చినమృగయావిహారం బది సమయంగరక్షోమృగములకయ్యె
నన్వయాగతమైన యదిమీకు ననువాసరంబు నంచితధర్మరక్షణంబు

కామసంహారుఁడైన కాశ్యపమౌనిసత్తమున కాశీరమంత్రంబవ్వైతి
వరయఁ బరోపకారార్థ మిదం శరీరం బను వినుతవాక్యంబు నిదియె

తే. దయయు దాక్షిణ్యమును నుపాదానములుగఁ, గనకగర్భుండు నీపుణ్యతనువొనర్చె
నీవ నినుఁ బోలుదువుగాని నిన్నుఁ బోల, జగతి నన్యులు లేరు దుష్యంతభూప.

సీ. ఆకాశకరులలో నైరావతము వోలె గ్రహములలోఁ దిగ్మకరుఁడు వోలెఁ
దోయాకరములలో దుగ్ధసింధువు వోలెఁ దరులలోఁ గల్పపాదపము వోలె
విహగవర్గములలో వినతాసుతుఁడు వోలె గిరులలో మేరుభూధరము వోలె
విబుధవర్గములలో వృద్ధశ్రవుఁడు వోలె ఫణులలో శౌరితల్పంబు వోలెఁ

తే. దారకావళిలో భవద్వంశకరుఁడు, చంద్రుఁడును వోలె నధికప్రశస్తిఁ గాంచి
వంశకరునందనుని జక్రవర్తిఁ గాంచి, భువనవర్తిని యగు కీర్తిఁ బొందుమధిప.

గీ. యాగసంరక్షణమునకై యడ్డు పెట్టి, యునిచితిమి నిన్ను నిన్నాళ్లు మనుజనాథ
వేఁటవచ్చుటగాని యీవిధ మెఱుఁగరు, దనుజయుద్ధంబుఁ గని జను లలుఁకినారు.

క. ఇచ్చట యాగక్రియయును, సచ్చరితుఁడ వీవు గలుగఁ జాగిఫలించెన్
వచ్చి తడవయ్యెఁ బురికి, న్వచ్చేయుదు గాక జనులనేత్రము లలరన్. 236

వ. అని యాశీర్వదించి మంత్రపూతంబులైన హరిద్రాక్షతంబులు శిరంబునందుఁ బెట్టియు
నుపఁ బ్రణామపూర్వకంబుగా వీడ్కొని వెడలు కాశ్యపమహామౌనియుటజంబున
కుంభోదపలయు మీరిచ్చట నుండునది యని యమాత్యసైన్యపతుల నొక్కయెడ
నునిచి శకుంతలకడమత్తుంబునకువచ్చి. 237

సీ. చెప్పంగఁ జూచుఁ జూచి ముఖాంబుజము దెసఁ దప్పక చూచును జెప్పనోరు
పోకనిల్చునుపాయములు మతించు మతించి నేర్పు దేలేక నిట్టూర్పువుచ్చు
నుండరామిని జెప్ప నూహించు నూహించి పురమున కనియర్థమునన నిల్చు
ననసూయఁ జూచుఁ బ్రియంవదఁ జూచు నా మేనకాత్మజఁ జూచు మీఁదుఁ జూచుఁ

తే. దరుణిదెస మోహలతి యీడ్వఁ బురముదెసకుఁ
గార్యలతయీడ్వ రెండువంకలకుఁ జనుచు
భావ్య మిది యని కార్య మేర్పఱుపలేక
నల్లమయ్యాలలూఁగె భూవల్లభునకు. 238

క. కీలీల మనసు డోలాం, దోళనమై చెప్ప నాల్కతుదఁ [1]గదలింపం
గాలేక తలిరుటాకున, వాలికనఖమున లిఖించి వనితకుఁ జూపెన్. 239

ఉ. ఆలిపిఁ జూచి నెచ్చెలులు యగ్రమునం బఠియించి మూర్ఛతో

1 గంపింపన్.

వ్రాలెను దంతి ద్రెంచి ధరవైచిన యయ్యెలదీవకై వడిన్
బాలికనామణీయని ప్రియంవదదా ననసూయ బెగ్గిలం
గాలువకై నృపాలకునికన్నుల నశ్రుజలంబు లొల్కఁగాన్. 240

వ. ఏతత్ప్రకారంబునఁ గొంతవడి నిలిచియంత నితాంతధైర్యవతియగు ననసూయ ప్రి
యంవదలం దెలిపి రాజుం గుస్తరించి శకుంతల నల్లనల్లన తేర్చి యయ్యిందువదన
వదనంబుఁ గెంగేల నెత్తి సుధామధురవచనంబుల నిట్లనియె. 241

మ. పురికింబోయెద నన్నమాత్రమున నంభోజాస్య యిట్లేదురే
ధరణీనాథులు భూమిపాలనముచేఁత ల్గ్లాని క్రీడారతి
న్సరికింటంగొని యున్నఁ బూజ్యయగురాజ్యశ్రీకొనల్పాగు నే
యనయంగా మెడఁబెట్టుకొంచుఁదిరుగన్ హారంబులే భామినుల్. 242

గీ. పోవుచున్నాఁడ నినుఁగొనిపోవుచున్నఁ, దంతవట్టును నిజముగా నరసికొనుము
నమ్మునినఁ బోవుచున్నాఁడ రాకుమనిన, వచ్చుదినములు గణకనుఁ దెచ్చికొనుము. 244

వ. అని రాజుం జూచి.

చ. నగరము లుజ్జగించి విపినంబుల రాజులు రాజనీతియుం
దగవునుగాదు పోవుటలు ధర్మము నాపనియట్ల యుండనీ
తగులముపెంపు నయ్యనుకుఁ దాల్మియు నెయ్యము నీవెఱుంగు దీ
మగువకు నున్కి యెయ్యది క్రమంబుఁ గ్రమజ్ఞుఁడ వానతీ[1] కృపన్. 245

సీ. అనినభూపాలుఁ డిట్లను సఖీమణియును ననుఁబాసి నిమిషమైననుభరింప
నోపదు నేను నయ్యువిదఁ బాసి ముహూర్తమును నిల్వనోప మీముగ్ధయెఱుఁగు
గాంధర్వవిధిఁ గరగ్రహమాటయు సమస్తమును ముని విజ్ఞానమునను దెలియు
ఘనుఁడు కాస్యపుఁ డంపఁగాఁ గొనిపోవుట తగుగాని కాకున్నఁ దప్పువచ్చు

తే. నేను బోయిన యేనాళ్ల కీలతాంగి, వెనకఁ బుత్తెంచి మీరెల్ల ననుపరాగ
వైభవంబునఁ గొనిపోవలయుఁ గాని, తెలుపరయెనుంగు నెక్కేల దిద్దిచొఱఁగ.

వ. కావునం బుట్టినింటినుండి యత్తవారింటికిఁ గన్నియలువచ్చుచందంబున మునీంద్రుం
డనుప వైభవంబునం గొనిపోయెదంగాన నందాఁక నొక్కక్షణంబు లేకుండిన నా
జ్ఞాచక్రంబు దొరగల్గువడు నిదిశిలగానట్టి ముద్రాంగుళీయకంబు మీవిద్రుమాధరిధ
రియించుంగాక యని తనవ్రేలియుంగరంబు నొసంగి కురంగనయన యంగుళింబెట్టెయె
ట్టకేలకుననుమతివడసి యనసూయాప్రియంవదలఁ బ్రియంబుచేసి యనిపించుకొని.

గీ. చిత్తమచ్చట మునికన్యచేతికిచ్చి, దేహమాత్రంబు రాజ్యప్రతిష్ఠకొలకు
నాశ్రమస్థలి వాసి సైన్యాన్వితముగ, నమృతకరవంశకరుఁ డేగె హస్తిపురికి. 248

1 దగున్.

శా. హేమాద్రివ్రతదానశౌండ ధిషణాహేలాసురజ్యేష్ఠ ది
క్సీమాలంఘనకేళిజాంఘికగుణా శ్రీలోలపద్మాలయా
రామామందిర నాగయప్రభుకుమారా శీతశైలాబ్ధివే
లామధ్యక్షితిపాలమంత్రిమకుటాలంకారహీరాంకురా.

క. కంబుజలజాతజలధర, శంబ ధనుఃకలశచక్రచాపాంకితహ
స్తాంబుజయుక్ స్లలితా, జంబూద్వీపావనీపసచివోత్తంసా.

స్రగ్విణి. భామినీ మన్మథా భాగ్యసంపన్నిధీ, యామినీనాథరేఖావతంసాంఘ్రిపూ
జామలస్వాంత విద్యానిశాంతా సదా, స్వామికార్యక్రియాచార నీతిక్రియా.

గద్య. ఇది శ్రీభారతీతీర్థగురుచరణకరుణాలబ్ధ సిద్ధ సారస్వతపవిత్ర గాదయామాత్య
పుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శాకుంతలా
శృంగారకావ్యంబునందు దృతీయాశ్వాసము.

